శ్రీగురుభ్యోనమః




# పరిష్కార

# రాజవిద్యా రాజగుహ్య శిరోమణి

## రాజయోగీయము

అచలఋషి

దయానంద పొన్నాల రాజయోగి

విరచితము



ప్రథమ ముద్రణ
(1000 ప్రతులు)

శివాజీ ప్రెస్
సికింద్రాబాదు.

 1973      మూల్యము రు 4/-

# పరిపూర్ణ రాజవిద్య రాజగుహ్య శిఖామణి

## విషయసూచిక

# పీఠిక

ఈ విశాల విశ్వమునందు మానవుడు సృష్టింపబడి, మేధపరిణతి నొంది, అశేష జీవరాసులలో తన విశేషాన్ని విలక్షణతను, గ్రహించి మానవతా ధర్మముతో జీవితయానం సాగించడానికి అవసరమైన, మానవ సౌభ్రాతృత్వము, అన్యోన్య

సహకారము, ఐహికాముష్మిక పురోభివృద్ధి, గాంచుట కనుకూలమగు త్రికరణశుద్ధి ప్రవర్తన, నిస్వార్థ సమష్టి శ్రేయోదాయక సత్కర్మానుష్ఠానము, మొదలగు కట్టుబాట్లతో పరిపూర్ణ ప్రబోధ నిర్ణయింపబడినది. మానవుడొక సంపూర్ణ వ్యక్తిగా, సర్వశుభలక్షణ శోభితుడుగా సృష్టింపబడినాడు. అట్టి అత్యంత శ్రేష్ఠమగు మానవ సమాజ శ్రేయస్సునకై నిర్ణయింపబడిన అచలఋషి సాంప్రదాయక ప్రబోధవిధానము కొందరికి గిట్టక వేదవేదాంత పద్ధతులనే సాకుతో కర్మ జ్ఞాన పద్ధతులు ప్రచారము చేసినారు. అవి ఒకదాని కొకటి విరుద్ధముగా నున్నందున అనేక మతము లుద్భవించి క్రమముగా సమాజమునందు అవినీతి, అధర్మము హింసాత్మక ప్రవృత్తి మానవలోకమునందు ప్రబలుచున్నవి. కనుక ప్రతిమానవుడు మత దురభిమాన రహితమగు చిత్తవృత్తితో యీ గ్రంథమును పఠించి, నిజము తెలుసుకొని, సనాతనమగు అచలపరిపూర్ణ ప్రబోధను పరిపూర్ణ గురుసార్వభౌముల వద్ద గ్రహించి, మానవ సమాజ కల్యాణకరమగు మానవ సౌభ్రాతృత్వము, అన్యోన్య సహకారము ఐహికాముష్మిక పురోభివృద్ధి సిద్ధించు పద్ధతులు తా మాచరించి సోదరమానవులచే ఆచరింప జేయగలరని మా విశ్వాసము

ఇట్లు
అచల ఋషి,
దయానంద రాజయోగి
శ్రీ శివరామదీక్షిత అచలగురు పీఠాధిపతి.

సికింద్రాబాదు
తేది. 1९-3-73

శ్రీ శివరామదీక్షిత అచలగురు
పీఠాధిపతులు

అ చ ల ర్షి



దయానంద పౌన్నాల రాజయోగి
గ్రంథకర్త

శ్రీగురుమూర్తి

# పరిపూర్ణ

# రాజవిద్యా రాజగుహ్యా శిఖామణి

## (రాజయోగీయము)

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః । గురుదేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరంబ్రహ్మా । తస్మై శ్రీగురవేనమః

### అచలఋషి సాంప్రదాయక తత్వశాస్త్ర నిర్ణయము

మానవు డీ ప్రపంచమున పుట్టినదాది "తత్వ జిజ్ఞాస" చేయుచునే యున్నాడు. అనగా, తనలో తానే ప్రశ్నించుకొని విమర్శించుకొనుచూ, తనకు తానే సమాధానాలు చెప్పుకోడానికి ప్రయత్నిస్తూ వచ్చినాడు. పూర్వపక్ష సిద్ధాంతములు తానేచేసు కొనేవాడన్న మాట.

మానవుని మేధ, పరిణతిచెంది ఆలోచనాశక్తి వికాసము చెంది వివేకము కల్గిన సమయము మానవ చరిత్రలో మహో న్నత పుణ్యకాలము. తనకూ, తనచుట్టూ వున్న ప్రపంచమునకూ గల సంబంధాన్ని గ్రహించి ప్రకృతిని తన కుపయోగకరంగా మలచుకొని, భావినాగరికతకు సంస్కృతికి, విజ్ఞానమునకు తత్వ చింతనకు ఆదిలో పునాదివేసి, సమాజనిర్మాణానికి కారణమైన కట్టుబాట్లనూ నియమనిబంధనలనూ మానవుడేనాటికి మరువ రాదు.

భౌతిక ప్రపంచాన్ని పరిశీలించి పొందిన వ్యవస్థాత్మక జ్ఞానము తత్వశాస్త్రమని చెప్పబడును. మన భౌతిక జీవితమునకు, మనోగత జీవితమునకు, సంబంధించిన సత్యములను, పరమ సత్యంతో వానికి కల సంబంధములను యీ మూటి ప్రధాన లక్షణములను, వివేచనా బుద్ధితో గట్టిగా అవగాహన చేసికొనుటకై వానిని సూత్రీకరించుటే తత్వనిర్ణయము.

మానవుడు తన సృష్టివిధానమును విమర్శించి చూడగా అన్నపానాదులచే, శుక్ల శోణితములు ఏర్పడి స్త్రీపురుష సంయోగములో స్థూలోపాధులు కలుగుచున్నవని తెలుసుకొన్నాడు.

ఈశరీరమందే యుండి, సంకల్పాదులు చేయు వస్తువు యేదని తనలో విచారించిచూడగా, అన్నపానాదు లనుకూలంగా నున్నపుడు సంకల్పం స్థిరంగా నుండుటయు. అవి కొఱతగా నున్నపుడు, తత్తరిపాటు చెందుటయు గ్రహించి, సంకల్పాదులు చేయునది అన్నముయొక్క సూక్ష్మాంశముగాను, అట్లే నీటియొక్క సూక్ష్మాంశము ప్రాణముగాను యున్నదని తెలుసుకొని, సంకల్ప ప్రాణములయొక్క చేరికకు మనస్సనే నామకరణం చేసి, అది నిశ్చయాత్మక మైనపుడు దానికి బుద్ధి యని పేరిడినాడు.

అన్నపానాదులు సృష్టి అయిన విధానమును గూర్చి, ఆలోచించి, అవి కాలత్రయముల (అనగా వర్షాకాలము, శీతాకాలము, వేసవికాలము)వలన కలుగుచున్నవని తెలుకొన్నాడు.

పిమ్మట కాలత్రయముల యుత్పత్తిని గూర్చి ఆలోచించి సూర్య, చంద్ర, నవగ్రహ నక్షత్రాదులు, పృథివ్యాది పంచ భూతములు చలించుచున్నవనియు, అందుకు ఆకాశమునందు చలన పద్ధతిగల వాయువుయొక్క చలనమే కారణమని, ఆకాశము యీ అన్నిటిని ఆవరించి వాని చలనమునకు ఆధారముగా నున్నదని గ్రహించినాడు

వాయుజలాగ్ని పృధువులన్నియు చలించుచున్నా వాని నావరించియున్న ఆకాశముమాత్రము చలించక అచలముగా నున్నది. సృష్టింపబడిన జీవశరీరములు శాశ్వతముగా నుండక మరణించుచున్నవి. జీవునికి మరణము కలుగకుండా, ఆకాశ పద్ధతిగా శాశ్వతముగా, నుండుటెట్లు ? అని మానవుడు పరిశోధన ప్రారంభించినాడు, అందుకుగాను వాత పిత్త శ్లేష్మ వ్యాధులు రాకుండా కాయసిద్ధికి మణి మంత్రౌషధ మూలికా ప్రయోగములు చేసిచూచినాడు. కాని శరీరము శాశ్వతముగా నిలబెట్టలేక పోయినాడు.

(2) ఆసన, ప్రాణాయామాది పద్ధతుల వలన సమాధి స్థితిపొందినా, కాలానుగుణ్యముగా, బాల్య, యౌవన, కౌమార వృద్ధాప్యములలో శరీరము మార్పుచెంది, వెంట్రుకలు, గోళ్ళు సహజముగా ఎదుగుచు, తుదకు మరణావస్థయు కల్గుచుండెను.

(3) కనుక ఆకాశపద్ధతిగా అచల స్థితిలో నుండినను శరీరములు మార్పుచెందనేల ? యని విచారించుచుండగా — అంతఃకరణము, నేత్రదృష్టి యేకమై బాహ్యాభ్యంతరముల

యందంతా ఒకానొక ప్రకాశము నిండుకొని యున్నట్లు తెలియబడెను. అందు వస్తుసముదాయము మాత్రమేగాక, సూర్య. చంద్ర నక్షత్ర నవగ్రహాది మండలములు, కాలత్రయములు, స్థావర జంగమ జీవోపాధులాదిగాగల సమస్త నామ రూప ప్రపంచము తెలియబడకుండా, తాను మాత్రమే యున్నట్లు, తన స్వరూపమే ప్రకాశముగా నున్నట్లు, సర్వమునకు తానే కారణముగా నున్నట్లు తెలుసుకోగలిగినాడు. ఈ దృష్టిసాధనయే శాంభవీముద్రయని చెప్పబడును.

(4) ఆకాశము, దాని సూక్ష్మమగు ప్రకాశమునకు గల చలనము వలన, భూతాకాశము, సూర్యాకాశము, నిరవయవాకాశము, దహరాకాశము, మహాకాశము అను ఐదువిధములుగా మార్పుచెందుట గమనించినాడు. ఈ విధముగా స్వప్రకాశచేతనమే సృష్టికారణమని, నిర్ణయించుకొన్నాడు. ఆ పిమ్మట దాని నంటకుండా నిండియున్న పరిపూర్ణమును గ్రహించినాడు.

పంచాకాశములనుండి, పంచభూతములు, వాని అన్యోన్య సమ్మేళనములో యేర్పడిన స్థావరజంగమ జీవోపాధులు వ్యుత్పత్తి చెందుచున్నవి. పరిపూర్ణమునకు మహాకాశమునకు యేలాటి సంబంధము లేనందున, వ్యుత్పత్తి అయిన జీవోపాధులు శాశ్వతమగు పరిపూర్ణపద్ధతిగా నిలచి యుండవు. ఉత్పత్తి. స్థితి, లయ, విస్తీర్ణ, ఆకర్షణాది పంచకృత్యములు మహాకాశము వల్లనే కలుగుచున్నవి. మానవుల జన్మరహితపద్ధతి పరిపూర్ణ అపరోక్షత్వము వల్లనే కలుగును. ఇతర యేపద్ధతులవలన కలుగదు.

మానవుడు జన్మరహిత పద్ధతి తెలుసుకొనక మరణించిన యెడల క్రిమికీటక పశుపక్ష్యాది వుపాధులు పొందవలసివుండును. అందుచే తగు జ్ఞానములేక దుఃఖము ననుభవించవలసి వచ్చును. ఈవిధంగా విమర్శించి అచలఋషులు జన్మరహిత విధానమును నిర్ణయించి నారు.

## ఋగ్వేద నిర్ణయము

అచలసాంప్రదాయక నిర్ణయవిధాన మించుకైన తెలియక, యించుక తెలిసిననూ, సరిగా అవగాహన చేసుకొనక, జన్మలు పరంపరగా అభివృద్ధిరూప పరిణామము జెందునని, నిర్ణయించుకొని కొందరు మహాకాశమునకు ఆదినారాయణుడని పేరిడి, ఆయన వుఛ్ఛ్వాస నిశ్వాసములే, ఋగ్వేద ధర్మగ్రంథముగా వుద్భవించెననీ, అందలి పద్ధతులు ఆచరించువారు బ్రహ్మ సంబంధమగు బ్రాహ్మణులనీ నిర్ణయించి, దీనికి వైదికమత సాంప్రదాయకమని నామకరణం చేసియున్నారు.

## సృష్టి నిర్ణయము

ఆదినారాయణుడు తన సంకల్పముచే హిరణ్యగర్భుని (బ్రహ్మను) సృష్టించి, ఆతనిచే జీవోపాధులను సృష్టింపజేసెను. హిరణ్యగర్భుడు అను ఆ బ్రహ్మ, తన సంకల్పము వలన మరీచాదులను, సనకసనందనాదులను పుట్టించి, సృష్టివిధానమును పాటించి, ఆచరణ సల్పుడని ఆజ్ఞాపించెను. మరీచాదులు కర్మ మార్గ మవలంభించిరి. సనకసనందనాదులు కర్మమార్గ మవలంబించక కర్మరహిత పద్ధతి నవలంబించిరి.

## కర్మ నిర్ణయము

ఋగ్వేదనిర్ణయానుసారము యజ్ఞయాగాదు లొనర్చి అందలి ప్రసాదానుభవము వలన, సత్సంతానాభివృద్ధి గాంచి, సంసారాభివృద్ధి యొనర్చవలెనని, నిర్ణయము. యజ్ఞఫలము లిచ్చు దేవతలు వేర్వేరుగా నిర్ణయింపబడి వున్నందున, యజ్ఞకర్తలకు భేదాభిప్రాయమును కలుగకుండా, సకల దైవయజ్ఞ ఫలములు యేకముగానే యుండునని నిర్ణయించి జైమినీ మహార్షి పూర్వమీమాంసయనే పేరుతో కర్మసూత్రములు రచించెను. వేదనిర్ణయానుసారముగా క్రతువులు చేయనిచో, శాస్త్రోల్లంఘనచేసిన పాపము సిద్ధించును. మరియు వేదశాసనము తిరస్కరించినందున వేదమే వ్యర్థమగును. సృష్టి, స్థితి, లయాదులు త్రిగుణసామ్య ప్రకృతివలననే జరుగుచున్నవి. కాన, పురుషుని ప్రాధాన్యత యేమీ వుండదని ప్రకృతికే ప్రాధాన్యత యీయబడినది. కర్మను నాలుగువిధములుగా విభజించి, అందు కామ్యకర్మను నిషిద్ధ కర్మలను చేయక, నిత్యకర్మ, నైమిత్తిక కర్మలను ఆచరించిన వారికి మోక్షము కలుగునని, సిద్ధాంతము చేయబడెను.

## జ్ఞాన నిర్ణయము

సర్వ యజ్ఞకర్మములు అర్థవాదములు లేక గౌణములు అని నిర్ణయించి, కేవల జ్ఞానమార్గముచేతనే మోక్షముకలుగును. కర్మలచే మోక్షము సిద్ధించదు. ఏలననగా (1) కర్మవల్ల కర్మ ఫలములు కలుగును. వాని ననుభవించుటకు మరల యుపాధి

గై కొనవలసి వచ్చును. (2) మోక్షము స్వతస్సిద్ధమే కాని కృతకము అనగా చేయబడెడిది కాదు. (3) చీకటి ప్రకాశము వల్లనే పటాపంచలగును. అట్లే జన్మకారణమగు అజ్ఞానాంధకారము జ్ఞానప్రకాశము వలన మాత్రమే రహితమై చెందును, అని వీరి వాదము.

వేదమాదిలో ఒక్కటే అయినా దానిని ఋక్, యజుస్సామాథర్వణము లను పేర నాలుగు భాగములుగా విభజించబడెను. యజుర్వేదము మరల శుక్ల, కృష్ణ యజుర్వేదములని విభాగింపబడెను. వేదశిరస్సులనే పేరుతో వుపనిషత్తులు నిర్ణయింపబడెను. ఈ ఋషి సాంప్రదాయములు వేరువేరుగానున్నందున, వాని సమన్వయమునను, వ్యాసమహర్షి వుత్తర మీమాంస యను పేర బ్రహ్మసూత్రముల రచించెను. సృష్టిస్థితిలయాదులన్నియు పురుషుని వల్లనే జరుగుచున్నవిగాని త్రిగుణసామ్య ప్రకృతివలన జరుగనేరవు. ఏలననగా త్రిగుణసామ్య ప్రకృతి జడము. అది మాయ యని నిర్ణయించి, పురుషునికి ప్రాధాన్యత నిచ్చి మహా వాక్యార్థానుభవజ్ఞానముచే జీవునికి మోక్షము కలుగునని నిర్ణయించిరి.

వైదిక పద్ధతిగానుండు బ్రాహ్మణసాంప్రదాయక మీమాంసకులయందు యీ భేదాభిప్రాయములు కల్గినందున, భిన్న భిన్న మత పద్ధతులు యేర్పడుటకు కారణ మయ్యెను.

## వైదిక కర్మలు

వైదిక కర్మలనగా యజ్ఞయాగాదులను, తు, చ, తప్ప

కుండా అనుసరిస్తే మోక్షము లభిస్తుందనీ, మంత్రాక్షరాలలో గర్భితంగా గొప్ప శక్తియుందనీ, ఆ మంత్రోచ్చారణచే పుణ్యం చేకూరుననీ, ఆఫలితం మరణానంతరం అనుభవించవచ్చుననీ, వైదికమత సాంప్రదాయకులు విశ్వసిస్తారు. కర్మకాండకు మూలమైన మంత్రాలు సర్వశక్తి సంపన్నములని వీరి అభిప్రాయము ఈ పద్ధతి దేవుని అస్తిత్వాన్ని నిరాకరించినప్పటికిన్నీ. ఆనాటి రాజులు, చక్రవర్తులు, వైదికులకు అమిత ప్రోత్సాహమిచ్చేవారు. అశ్వమేధ రాజసూయ యాగాదులనేగాక, నరమేధ యాగాలను కూడా చేసేవారు. వేదాలను కంఠస్థం చేయడంలోనూ, వైదిక మంత్రాలను పఠించుటలోనూ ప్రావీణ్యంగల పండితులను విశేషంగా గౌరవించి అగ్రహారాలిచ్చి సత్కరించేవారు. జీవితాంతం పోషించేవారు. గ్రుడ్డిగా వైదికమత కర్మలను ఆచరించడం పరమలక్ష్యంగా పెట్టుకొన్న యీ వైదికపద్ధతుల యందు విశ్వాసము లేక పాశుపత, కాపాలిక, శాక్తేయ, గాణాపత్యాది దుష్టసాంప్రదాయము లెన్నో క్రమశః శైవమతం పేరుతో విశేషవ్యాప్తిలోనికి వచ్చెను.

## కాపాలిక మతము

కాపాలికులు స్త్రీ యోనిపై నాత్మ నూహించుకొని ధ్యానం చేయడం వలన, మోక్షం సిద్ధిస్తుందని విశ్వసించేవారు. ఐహికాముష్మిక సుఖములను పొందవలెనంటే యీదిగువ నుదహరించిన కర్మల నాచరించాలని వారి నమ్మకం. (1) మనిషి పుర్రెలో భుజించడము (2) మృతకళేబరాన్ని దహించిన భస్మం

శరీరానికి పులుముకోనడం (3) ఆ భస్మాన్ని తినడం (4) చేతిలో యెల్లపుడూ దండాన్ని ధరించడం (5) నిరంతరం, ఒక పాత్ర నిండా మద్యాన్ని నిలవయుంచుకోవడం (6) అందులో భగవంతుని యూహించుకొని, ధ్యానించి స్వీకరించడం (7) కాపాలిక మతం స్వీకరిస్తేనే మోక్షం అని నమ్మడం (8) భైరవుని అవతారములుగా తాముద్భవించినట్లు నమ్మడం (9) మానవుని కపాలముతోనూ, మద్యముతోనూ, నరరక్తముతోనూ, భైరవుని పూజించినచో ఆతడు ప్రసన్నుడు కాగలడనీ ఆవిధముగా పూజించడం, వారి నిర్ణయాలు.

## శాక్తేయ మతం

సృష్టికంతకూ మూలం, శక్తిస్వరూపిణి అయిన త్రిపుర సుందరి. ఆమె నారాధించిన వారికి మోక్షం సిద్ధిస్తుందని వీరు నమ్మేవారు. ఈ ఆరాధనపద్ధతి పరమనీచమైనది. సజీవులైన కన్యలను (నవకన్యలంటూ) తొమ్మిదికులాల వారిని తీసుకొని వచ్చి, వారిని దిగంబరులజేసి, యోనులను పూజించి, పూజానంతరం మద్యము, మాంసము, చేపలు, నైవేద్యమిచ్చి, వారు భుజించిన పిమ్మట, భుక్తశేషములు, మహాప్రసాదంగా స్వీకరించి, ఆ కన్యలతో సంభోగించేవారు. మకారపంచకమనే మధు, మాంస, మత్స్య, మంత్ర, మైధునము లనేవి వీరి పూజాపద్ధతిలో ముఖ్యము. స్త్రీలు లభించనిచో, భూర్జర పత్రము మీదనో, పట్టుగుడ్డమీదనో, బంగారు రేకుమీదనో స్త్రీయోనుల ఆకారములను తొమ్మిదింటిని చిత్రించి, అందులో మధ్యనున్న

"యోని"ని మంత్రాదులతో పూజించేవారు. మొత్తం యీ చక్రమునకు శ్రీచక్రమని పేరిడిరి.

## గాణాపత్య మతము

శాక్తేయులకు వలెనే, గాణాపత్యులకు కులవిచక్షణలేదు. వివాహమైనవారు, కానివారు అని విచక్షణలేదు. స్త్రీపురుషులు విచ్చలవిడిగా ప్రవర్తించేవారు. మద్యమాంసముల నిషేధంలేదు. వీరి దైవము గణపతి.

## పాశుపత మతనిర్ణయము

పాశుపత మతావలంబకులు శరీరమునిండా బూడిద పూసుకొనీ ఆరు ప్రక్రియల ద్వారా శివుని పూజించుటవల్ల మోక్షం సాధించనగునని యెంచెడివారు. (1) నవ్వడం (2) పాడడం (3) నృత్యం చేయడం (4) ఎద్దు అరచినట్లు నాలుక అంగుట్లోకి దూర్చి అరవడం (5) సాగిలపడడం (6) వినబడీ వినబడకుండా గొణగడం. మరో ఆరుమార్గాలు కూడా వీరు నిర్ణయించినారు. (1) మేల్కొని యుండగా నిద్రించి యున్నట్లు భావించుకోవడం (2) శరీరావయవములను పక్షవాతపు రోగివలె ఆడించడం (3) కాళ్ళుపడిపోయినట్లు వూహించుకొని నడవడం (4) అందమైన స్త్రీతో శృంగారచేష్టలు చేస్తున్నట్లు భావించుకోడం (5) పదిమందీ నిషేధించిన కార్యాన్ని యుక్తాయుక్త విచక్షణ తెలియనట్లుగా ఆచరించడం (6) పిచ్చివానివలె మాట్లాడడం.

ఆరోజులలోనే దేవదాసీ పద్ధతి వ్యాప్తి చెందెను. మతం పేరుతో నైతిక విలువలన్నియు, పతనావస్థకు దిగజారి, నశించి

పోయెను. మంత్రగ్రంథాలు సహితం అసభ్య ప్రక్రియల వర్ణనలతో నిండిపోయెను. దేవాలయాలపై బూతుబొమ్మలు చెక్కబడేవి. పశుతుల్యుడుగా మానవుడు తయారయ్యెను. మానవుని తిరిగి మానవునిగా చేయడం ఆనాటి వివేకవంతుల ప్రధాన కర్తవ్యమాయెను.

## జైనమతము

భారతదేశంలో పై విధముగా ప్రబలి సంఘములో వేళ్ళు తన్నుకొనిపోయిన హింసాత్మకమగు యజ్ఞయాగాది క్రతువులు, పశుతుల్యులుగాచేయు దుష్టమత విధానములు, గమనించి, ప్రత్యేక దృక్పథంతో విమర్శించి, నూతన ధర్మములను ప్రతిపాదించి, ప్రచారమొనర్చిన మనీషి మహావీరుడు. అస్తవ్యస్తమైపోయిన సమాజములలో మానవ విలువలు నశించి అవినీతి ప్రబలుటకు అవకాశమేర్పడెను. వివిధ దృక్పథాలను సమీకరించి సమన్వయం చేసి, లౌకికపారమార్థిక వాదాలను పరిశీలించి, ఒక నూతనమగు సుశిక్షితమైన అనుభవసత్యమైన దృక్పథాన్ని, మానవలోకమునకు జైనమత మందించింది. అందువలన యీ మతమున పారమార్థ చింతన, మానవాతీతమైన అలౌకిక మానసికవ్యవస్థలు, మూఢ నమ్మకాలు అంతగా గోచరించవు. కనుపించే జగత్తులో, అనుభవించే జీవితాన్ని ఒక సక్రమమార్గములో నడపించి జైనము మానవత్వపు విలువలను పునరుద్ధరింపజేయుటకు సమకట్టెను. కనుక దాని దృష్టి జీవిత విధానమునకే పరిమితమైంది. తాత్విక చింతన దాని పరిధిలో అంతగాలేదు. జైనులు చూపించినది సంఘసముద్ధరణాభిలాష మాత్రమేనని యనవచ్చును.

## బౌద్ధమతము

పరమజిజ్ఞాసులైన గౌతముని ప్రపంచములోనున్న, జన్మ వ్యాధి జరామరణాది విషాదకర పరిస్థితులు కలవరపెట్టెను. "జన్మదుఃఖం, జరాదుఃఖం, జాయాదుఃఖం పునఃపునః సంసార సాగరం దుఃఖం తస్మాత్ జాగ్రత జాగ్రత !" అనున్యాయమున, యీదుఃఖమయ జీవితంనుంచి బయటపడుటకు పలువురు శ్రమణులు, బ్రాహ్మణులు అనేకమార్గములు సూచించిరి. ఈ జన్మలో కలిగే దుఃఖము పూర్వజన్మల ఫలితమని, దాన్ని దాటడానికీ, అనంతమైన పారలౌకిక జీవితాన్ని అందుకోడానికీ, వైదిక కర్మకాండలే సాధనములని బోధించి, తాను యజ్ఞయాగాదులను నిర్వహిస్తూ వైదికకర్మకాండలను హింసాపద్ధతులతో నవలంబించి, అదే ప్రవృత్తి మార్గమంటూ దానినే బ్రాహ్మణులు అనుసరించినారు. దీని నిరోధానికి లోకాయతికులు, జైనులు, యితర శ్రమణులు ప్రయత్నించి కొంతవరకు సఫలీకృతులు కాగల్గినారు. దీనికి విరుద్ధంగా, సకల నమ్మకములను అధిక్షేపించుచూ, దృశ్యజగత్తును యదార్థంగా గైకొని, యిహలోక సౌఖ్యాలకే ప్రాముఖ్యతనిచ్చి, వానిని సాధించుటయే పరమలక్ష్యంగా జీవితం నడపుకొనుటయే శ్రేష్ఠాతి శ్రేష్ఠమని చార్వాకులు ప్రచారం చేసినారు. దీనివలన కొంత హింసావిముఖత్వము యేర్పడి బ్రాహ్మణుల గౌరవము క్షీణించెనేగాని, తుదకు నైతిక పతనానికే హేతువైంది. జైనమత సిద్ధాంతానుసారము వలంబించవలసిన కఠిన నియమాలు, కొన్ని సత్ఫలితాలు కలి

గించినా, పూర్తిగా ఆచరణయందుంచుట సుసాధ్యము కాక పోవుటచే, జైనమతము బహుళజనాదరణ పొందలేక పోయినది. పూర్వసంచిత కర్మానుభవాలనుండి తప్పించుకొనుటకై కొందరు సన్న్యాసజీవితం గడపెడివారు. అదే నివృత్తిమార్గం. ప్రవృత్తి మార్గాను యాయులు, సంఘజీవితాన్ని ఒకవిధంగా సంక్షుభితం చేస్తే నివృత్తిమార్గాను యాయులు వైయక్తిక మోక్షాన్ని అపేక్షించి సంఘమునకే దూరమైపోయిరి. ఈ రెండు మార్గాలు సాంఘిక పురోభివృద్ధికి దోహదంచేయడం లేదని గ్రహించిన గౌతముడు, యీ రెండు మార్గాలను పరిహరించి మధ్యే మార్గాన్ని ప్రతిపాదించినాడు. అదే అష్టాంగమార్గము. (1) సమ్యగ్దృష్టి (2) సమ్యగ్సంకల్పం (3) సమ్యగ్వచనము (4) సమ్యక్కర్మ (5) సమ్యగ్జీవనం (6) సమ్యగ్ప్రయత్నము (7) సమ్యగ్స్మృతి (8) సమ్యగ్సమాధి, అను అష్టాంగములతో కూడిన ఆచరణయే మధ్యేమార్గము.

బుద్ధుడు కేవలం, బుద్ధీంద్రియమును సద్వినియోగం చేసి పరిశుద్ధ జీవితవిధానమును నిర్ణయించి దానిచే నిర్వాణము సిద్ధించగలదని ఆసించినాడు. కాని పారమార్థికతత్వ జిజ్ఞాస చేయలేదు కనుకనే ఆయన ప్రతిపాదించిన అష్టాంగమార్గమున సహితం పారమార్థిక విషయ ప్రసక్తి గనే గానరాదు.

## బౌద్ధంలో దుష్టసాంప్రదాయాలు

బుద్ధుడు, మానవులకు సోదరభావము, స్వేచ్ఛాలోచన, నైతిక ప్రధానమగు పరిశుద్ధ జీవనము మొదలైనవి బోధిస్తే,

ఆయన శిష్యులు తమ అభిరుచుల కనుగుణ్యమైన మార్గాలనే ప్రబోధిస్తూ మూలసిద్ధాంతములను తలక్రిందులు చేసినారు. మంత్రాలను సృష్టించడం, విగ్రహారాధన ఏర్పరచడం, ప్రజలలో మూఢనమ్మకాలను ప్రోత్సహించడం, గుహ్యసమాజములను నెల కొల్పడం మొదలగుకార్యముల ద్వారా బుద్ధునిశుద్ధమైన ప్రబోధ నామమాత్రా వశిష్టమయ్యెను. బుద్ధుని అనుయాయులు అష్టాంగ మార్గమును అనుసరించలేదు. సరిగదా, భైరవీచక్రము లేర్పరచి, సారాయి, సంభోగము మంత్రోచ్ఛారణలతో ఒక విచిత్ర మత మును బౌద్ధమతము పేరుతో అనుసరించుచుండిరి. మంత్రయానం, తంత్రయానం వజ్రయానం మొదలగు పేర్లతో, నూతన సంప్ర దాయములు వెలసెను. ఈ సంప్రదాయాలవారు, బాహ్య వేష ములో బౌద్ధభిక్షువులవలె తిరుగుచూ, గుహ్యసమాజములలో స్వేచ్ఛాజీవులై స్త్రీలు ముక్తిదాతలనీ, పురుషులు ముక్తి సాధ కులు అనీ, మదము అమృతమనీ, భావించుచూ వారిలో ప్రతి భావంతులగు పండితులు సైతము భ్రష్టజీవితమే గడపుచుండిరి. త్రాటకము, హిప్నాటిజం, వంటి కొన్ని ప్రక్రియలనువారు గుర్తెరిగి, అభ్యసించి వాని ప్రభావంతో ప్రజాసామాన్యమును వశీకరణగావించుకొని మూఢనమ్మకాలను వారిలో నెలకొల్పి లోబరుచుకొని స్వార్థ ప్రయోజనములు సాధించుకొనుచుండిరి. బౌద్ధుల ఆచరణ విధానము, చివరకు అత్యంత జుగుప్సాకరమై శిష్టాచార పరాయణులకు కంటక ప్రాయమయ్యెను.

## అద్వైత మతము

శంకరాచార్యులు, ఓంకారనాథాశ్రమంలో గోవిందభగవ

త్పాదులవద్ద అద్వైత సాంప్రదాయానుగుణ్యంగా సేవాసాధన లొనరించి, ఆచార్యుల మెప్పువడసి, కాశీనగరమేగి, అక్కడ కొంతకాలం శిష్యులకు అద్వైత వేదాంతం బోధించి, అటనుండి బదరికాశ్రమమేగి, అచట ప్రస్థానత్రయ భాష్యమును పూర్తి జేసి, ఆ పిమ్మట భారతదేశమంతటా పర్యటించి, శాస్త్రార్థంచేసి, బౌద్ధులను, కాపాలికులను, పూర్వమీమాంసకులను ఓడించి, కొందరిని వైదిక మతానుయాయులను గావించెను.

బ్రహ్మమొక్కటియే సత్యమైనదనీ, అనంత జ్ఞానానంద స్వరూపమైనదనీ, జగత్తు మిథ్యనీ, జీవుడు తత్వతః బ్రహ్మమే ననీ, అద్వైతుల సిద్ధాంతము. "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ, నాపరః" అని యీ సిద్ధాంతము ఒక్క శ్లోకార్థంలో యుద్ఘాటింప బడినది.

వేదములకు కర్త అనేవాడొకడు లేనందున (పురుష నిర్మితం గానందున) అవి అపౌరుషేయములనీ, అనాదియగుటచే ఫలానాకాలములో పుట్టెననుటకు వీలుకాదనియూ, నిత్యమగుటచే మార్పుచెందినదిగాని నశించునదిగాని కాదనియూ, కనుక సర్వకాలములకు సర్వులకు నిత్యమైన ప్రమాణ గ్రంథరాజమని వేదములు స్తుతింపబడుచున్నవి. వీని చివరిభాగము లుపనిషత్తులు. జీవుని జనన మరణ ప్రవాహామునుండి లేవనెత్తి జన్మరాహిత్య స్థితిని చేకూర్చు పవిత్రగ్రంథము లుపనిషత్తులని నిర్ణయము.

ఋగ్యజుస్సామాథర్వణవేదములను చతుర్వేదములనుండి జీవబ్రహ్మల యభేదమును సూచించు నాలుగు మహావాక్యములు

గై కొనబడినవి. సామవేదమునుండి "తత్వమసి", అధర్వణవేదము నుండి "అయమాత్మా బ్రహ్మ", యజుర్వేదము నుండి "అహం బ్రహ్మాస్మి", ఋగ్వేదమునుండి "ప్రజ్ఞానం బ్రహ్మ" అనువాక్యములే మహావాక్యములు. జీవబ్రహ్మల కభేదత్వమును ప్రతిపాదించు యీ మహావాక్యముల శ్రవణ, మనన, నిధి ధ్యాసలే జీవబ్రహ్మైక్యమునకు సాధనములుగా నిర్ణయించిరి.

శ్రవణ, మనన, నిధి ధ్యాసలవలన, బ్రహ్మపరోక్షానుభవం సిద్ధిస్తుందని సిద్ధాంతం. కాని, బ్రహ్మపరోక్షత్వ జ్ఞానము పూర్వపుణ్యం వున్నవారికే సిద్ధించగలదు. అది సిద్ధించనివారేమి చేయవలెనంటే—శ్రీవిద్యోపాసన చేయవలెనని యందురు. శ్రీగౌడపాదాచార్య విరచిత "శ్రీవిద్యారత్న సూత్రాల"లో మొదటి సూత్రం "అథ శాక్తమంత్రాగమ జిజ్ఞాసా"అనేది దీనికి శంకరాచార్యులవారు వ్రాసిన "దీపికాఖ్యటీక"లో అథఃశబ్ద ప్రయోగాన్ని వివరిస్తూ "యద్యపి సాధన చతుష్టయ సంపత్యనంతరం బ్రహ్మజిజ్ఞాసా కర్తవ్యః. తథాపి ప్రబల ప్రారబ్ధత్రయ ప్రతిబంధక నివృత్తి ద్వారా శాక్తమంత్రాణాం ఆగమస్యచ జిజ్ఞాసః" అనగా యీ ప్రతిబంధముల నివృత్తి కొరకే వుపాసన యేర్పడినది, అని ప్రతిపాదిస్తూ "సౌందర్యలహరి" మొదలగు గ్రంథములు శంకరులు రచించినారు.

కనుక మహావాక్యార్థానుభవ ప్రాప్తికి సాంప్రదాయములు నిర్ణయించినవి రెండే మార్గాలు. (1) సన్యాసాశ్రమ స్వీకారము (2) శ్రీవిద్యాదీక్ష. యీ రెండూ తప్ప యితర

మార్గములు చెప్పబడలేదు. సన్యాసాశ్రమంలో నున్న కఠిన నియమాలు, కష్టనిష్ఠూరాలు, అవి సహించలేక భ్రష్ఠులై గంజాయి వగైరా మత్తుపదార్థాలు స్వీకరించడం అంతకంటె హీనమగు రహస్య సంసారాలు సాగించడం, అందరికి తెలిసినవే.

ఇక శ్రీదీక్ష (లేక పూర్ణదీక్ష)ను గురించి, ఇందు వామాచార దక్షిణాచారాల గురించి, అందు వామాచార పద్ధతిలో నవలంబించు దుష్టాచారములు మకారపంచకము గురించి అనేక పరస్పర భిన్నాభిప్రాయాలు ఏర్పడి, ఆయా సాంప్రదాయక గురుశిష్య మండలులలో వ్యాప్తిలో వున్నాయి. ఈ పద్ధతుల వలన అద్వైతం అపహాస్యం పాలైనది, ఆఖరికి "వేదాంతులు వచ్చినారు. చెంబూ ముంతా జాగ్రత" అనే స్థితికి దిగజారినది. తిరిగి సంఘమునకు మహా దురవస్థ యేర్పడెను.

## విశిష్టాద్వైతము

రామానుజాచార్యులు పుట్టి హృదయస్థమగు భక్తికి ప్రాధాన్యత నిచ్చి సర్వమానవ సౌభ్రాతృత్వము, సర్వసమాన ప్రతిపత్తి, నిర్ణయిస్తూ విశిష్టాద్వైత మతమును బోధించినాడు.

మానవులు జీవితంలో క్లిష్టపరిస్థితుల నెదుర్కొనవలసి వచ్చినపుడు, వానినుండి రక్షింపబడుటకు ఒక మహత్తర శక్తి మీద నాధారపడతారు. కష్టసుఖాలలో శాంతి సౌఖ్యములు చేకూరుటకు, శరణుపొంద దగినవాడు, అట్టి మహిమాన్విత శక్తియుక్తులు గలవాడొక్క పరమాత్మయే. పారమార్థిక తత్వాన్ని స్పష్టంగా సుబోధకంగా వివరించలేని సిద్ధాంతము

మానవుని ముఖ్యప్రవృత్తులను సమర్థించలేని సిద్ధాంతము సామాన్య ప్రజాదరణ పొందబోదు. భగవంతుడు సత్యము నిత్యము అయివుండి సామాన్య మానవుని కతీతుడైనా అత్యవసర సమయాలలో వెంటవుండి తోడ్పడేవాడు కావలె. ఆయన మానవునికి తండ్రి, తల్లి, మిత్రుడు, బంధువు, ఆప్తుడుగా వుంటూ మానవునికి అతిసన్నిహితుడుగా నుండవలె. ఇటువంటి సంబంధము నిరాకార నిర్గుణ బ్రహ్మములో మానవునకు సంప్రాప్తించదు. కనుక దైవమునందు యిట్టి సౌలభ్యముండిననే మానవున కుపాస్యము లేక ఆరాధ్యదైవము కాగలడు. అట్టి సౌలభ్యం సగుణ సాకార దైవములోనే సాధ్యము. సాకారమూ, సగుణమూనైన దైవముతో మానవు డనేక సంబంధ బాంధవ్యాలు కల్పించుకొని, శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర, శిశు భావాలతో ఆ దేవదేవుని యుపాసించి యిష్టకామ్యార్థ సిద్ధి బొందుచూ ఆనంద హృదయుడు కాగల్గును.

సాకారదైవము, ప్రేమ, వాత్సల్య, కృపారసములే స్వరూపంగా గలవాడు. భక్తసులభుడు. కాబట్టి సంసార సమస్యలతో చిత్తచాంచల్యము బొంది మానవుడు తరుచు చేసే పొరబాట్లను కనికరముతో క్షమించగలడు. అతడు సమస్త కల్యాణ గుణాకరుడు. క్షమ కూడా ఆ భగవంతుని గుణము. కనుక భక్తసులభుడుగానుండు సాకారదైవమే వుపాసింప దగినవాడు కనుక జ్ఞానమును, భక్తికి అంగముగా జేసికొని, ముక్తికి భక్తియే సాధనమని రామానుజులు బోధించినారు. నిర్గుణ

బ్రహ్మమునందు భక్తియుపాసనలు యెట్లుసాధ్యము ? శ్రీమహా విష్ణువే సాకార బ్రహ్మము. ఆయన యందలి భక్తిచే సాలోక్య సామీప్యాది ముక్తులు సులభంగా ప్రాప్తించును.

మానవ సౌభ్రాతృత్వము కొఱకు నిర్ణయించిన యీ మతమునందు క్రమశః భోగలాలసత్వము, త్రాగుబోతుతనము, వ్యభిచారము సన్నసన్నగా ప్రవేశించి చోటు చేసుకొనెను. భగవంతుడైన శ్రీమహావిష్ణువుయొక్క విగ్రహాములకు శాల భోగములు, రాజభోగములు, పవళింపుసేవలు జరుపుచూ, తాము కూడా అట్టిభోగపరాయణులై వాని ననుసరించుట వలన, రామానుజ మతమనగా, త్రాగుబోతు వ్యభిచారమతమని వాడుకలోనికి వచ్చెను. భగవంతుని యందు భక్తి ప్రపత్తులు పోయి, విధినిషేధము లడుగంటి అధర్మము ప్రబలి సమాజ శ్రేయస్సునకు ఘోరప్రమాదము వాటిల్లెను.

## ద్వైతము

శంకరుల అద్వైత సిద్ధాంతాన్ని పూర్తిగా ఖండిస్తూ కొన్ని విషయాలలో విశిష్టాద్వైతాన్ని సమర్థిస్తూ, అందుకు తగిన కొన్ని శాస్త్ర పురాణ ప్రమాణాలను ఆధారంగా తీసుకొని, జీవ బ్రహ్మలకు అత్యంత విభిన్నత్వమును ప్రతిపాదించి, అందుకు పటిష్టమైన తార్కిక వాదనలతో స్థిరపరచిన వేదాంత శాఖ యీ ద్వైతము. దీని ప్రతిష్ఠాపకులు మధ్వాచార్యులు. ఈ సిద్ధాంతము ద్వైతముపేర ప్రసిద్ధమైయున్నది. ఇందు అభిన్నత్వము పూర్తిగా పరిహరింపబడి, తాత్త్వికముగ పరస్పర భిన్నత్వమే సిద్ధాంతము చేయబడినది.

(1) భగవంతునికి జీవునికి భేదము (2) భగవంతునికి జడ ప్రకృతికి భేదము (3) జీవునికి జీవునికి భేదము (4) జీవునికి ప్రపంచమునకు భేదము (5) ప్రపంచంలోని జడ పదార్థాలలో పరస్పర భేదము. యీ అయిదు విధాలుగా భేదము నిరూపించబడినది. ఈ సిద్ధాంతములో ముక్తి అంటే జీవుడు అన్యరూపాన్ని వదలి తన స్వరూపంలో, భగవంతుని సాన్నిధ్యంలో, ఆయన నివసించే స్థానంలో, నుండడమేగాని, సారూప్యాది ముక్తులేమిన్ని ఆయన అంగీకరించలేదు. భగవంతునిలో ఐక్యం పొందడం అసలే కాదు. భగవంతునికీ జీవునికీ హాస్తి మశకాంతర భేదము కలదని ద్వైతమత సిద్ధాంతం. వేదవిహిత కర్మాచరణము ద్వారా, జీవుడు పరిశుద్ధి చెందగలడని కర్మకు ప్రాముఖ్యతను బోధించినాడు. మానవుడెన్నడూ మాధవుడు కాజాలడు. భగవంతుడు ప్రభువు. జీవుడు కేవలం కింకరుడు మాత్రమే. దాసానుదాసుడు. అని ప్రతిపాదించుటచే మానవుని ఆత్మగౌరవము, ఉన్నతాదర్శము నశించిపోయెను. మానవోపాధి యొక్క విశిష్టత గోల్పోయి, పారతంత్ర్యము ప్రబలి హీనిసత్వ లక్షణములు ప్రబలెను.

## దుఃఖనిర్ణయము

"శ్లో॥ జన్మదుఃఖం, జరాదుఃఖం, జాయాదుఃఖం పునః పునః సంసారసాగరం దుఃఖం తస్మాత్ జాగ్రత జాగ్రత!" అని చెప్పబడినది. ప్రపంచంలో దుఃఖమున్నదని ఆర్యులు గ్రహించి విమర్శ సాగించినారు. దుఃఖానికొక కారణముండక తప్పదు.

అది ఏది ? అనే జిజ్ఞాసచేసి నిర్ణయించడంలో, అనేక మతభేదా లుత్పన్నమైనాయి. దుఃఖము స్వయం కృతాపరాధమని కొందరు, పరకృతమని కొందరు, యాదృచ్ఛికమని కొందరు, పూర్వకృత సంచితకర్మ ఫలమని కొందరు, తృష్ణ (ఆశ) యే సర్వ దుఃఖాలకు మూలకారణమని కొందరు ; తృష్ణవల్లనే జన్మమరణాలు కలుగుచున్నవంటే, ఆ తృష్ణను తొలగించే మార్గమేది ? మరీచాదులనుసరించిన కర్మమార్గమును ప్రవృత్తి మార్గమని, నిర్ణయించినారు. కాని వా రనుసరించిన పద్ధతులు సంఘ జీవితాన్ని సంతుష్టితం చేసినవి. సనకాదులు నిర్ణయించి అనుసరించిన జ్ఞానమార్గము నివృత్తి మార్గమని పేరు పొందినది. అందు నిర్ణయించిన పద్ధతులు కేవలం మోక్షాన్ని మాత్రమే అపేక్షించినవి అగుటచే, సంఘ జీవితానికి దూరమైనాయి. ఈ రెండునూ గూడ సంఘ శ్రేయస్సునకు తోడ్పడుటలేదని, గౌతమబుద్ధుడు "మధ్యే" మార్గమును నిర్ణయించినాడు. అది వేదసమ్మతంగాదని శంకరాచార్యులు ఖండించి సనకాదుల జ్ఞాన మార్గమును సిద్ధాంతంచేసి స్థాపించినాడు. మరీచాదుల కర్మరూప ప్రవృత్తి మార్గము గృహస్థులై యున్నవారికి యోగ్యమై నందున దానిని శంకరులు నిరసింపలేదు. సత్కర్మాచరణవలన, అంతఃకరణశుద్ధి గావించుకొంటూ, యిష్టదైవోపాసనవలన ఏకాగ్రత సాధించినచో జ్ఞానమార్గమున కధికారికాగలడు అనీ సత్కర్మ వుపాసన అందుకు పరంపరాసాధనములని శంకరులు నిర్ణయించెను.

[4]

## జన్మదుఃఖ రూపమా ?

దుఃఖకారణ మేది ? అను ప్రశ్నకు అచలబుఋషుల సమాధానమేమి ? సకల సృష్టి స్థితి లయములకు నత్యంత మూలకారణమైన కారణబ్రహ్మమే దుఃఖమునకు కూడా మూల కారణం, అని అచలబుఋషుల సమాధానము.

అద్వైత నిర్ణయమునందు సర్వసంసారమునకు మూలము జీవుని అవిద్యలేక అజ్ఞానమేననీ, అది సమష్టియందు త్రిగుణా త్మక ప్రకృతి లేక మూల మాయయనీ, అది పరమాత్మయందు లేనేలేదనీ, ఆ పరమాత్మ ఆనందఘనుడనీ, కనుక ఆ పరమాత్మ యొక్క స్వరూపజ్ఞానం కలిగినపుడు అత్యంత దుఃఖనివృత్తి కాగలదనీ యితరులంటారు. కాని ఆ బ్రహ్మమే జగత్కారణమని శ్రుతి స్మృతులలో ప్రసిద్ధమై యున్నపుడు, సర్వసంసారమునకు, జ్ఞానాజ్ఞానములకు, సుఖదుఃఖాది సర్వద్విపుటులకు, త్రిపుటులకూ అదియే మూలకారణమై యున్నదనక తప్పదు. అట్టి పర మాత్మయే పరమ సత్యమనీ, అంతకన్న అధికం లేదని నమ్మి వూరకుంటే ప్రయోజనం లేదు. మాయా బ్రహ్మలలో, మాయ అసత్యమని బ్రహ్మ సత్యమని యెంచి ఒక్క మాయనే లేదని దానిని మాత్రమే నిరసించి వూరకొన్నచో లాభము లేదు. "పుట్టమీద కొట్ట భుజగంబు చచ్చునా ?" అన్నాడు వేమనయోగి.

"జన్మదుఃఖం, జరాదుఃఖం జాయాదుఃఖం పునః పునః, సంసారసాగరం దుఃఖం తస్మాత్ జాగ్రత జాగ్రత॥" అని పెద్దల

నిర్ణయంలో దోషంలేదు. దుఃఖమను దానిని పూర్తిగా విమర్శించి నిర్ణయించినపుడేగాని దాని కారణమున్ను, దాని నాశన విధానమున్ను తెలియదు. దుఃఖం అనగా నేమి? 'ఖం' అనగా, బ్రహ్మము, ఆకాశము, యింద్రియములు అను నర్థము లున్నవి. యింద్రియములకు రాజని చెప్పదగిన అంతఃకరణము, దాని కారణమగు ఆకాశము, ఆ ఆకాశమునకు అధిష్ఠానమగు, బ్రహ్మము యివన్నియు 'ఖం' అను దానికి అర్థములే. అవి దుష్టము లయినపుడు లేక మలినము చెందినపుడు దుఃఖం. అది మంచిగా శుద్ధముగా నున్నపుడు "సుఖం" అని శబ్దార్థము. కనుకనే సకల సుఖదుఃఖములకు పరమాత్మయే కారణమని చెప్పవలెను.

మనకనుభవంలో నున్న సుఖదుఃఖములు అంతఃకరణచే తెలియబడుచున్నవి. అనుకూల, ప్రతికూలములగు ఆఘాతములు సంఘటనలు, శబ్దాదివిషయ గ్రహణము మొదలగు వానివల్ల సుఖదుఃఖములు, అంతఃకరణమునకు కలుగుచున్నవి. కనుక ప్రతికూల వేదనయే దుఃఖము, అని దుఃఖ నిర్వచనము చేయ నగును.

ఆధునిక విజ్ఞానములో వృక్షాదులకు కూడ అనుకూల, ప్రతికూల వేదనలు (లేక సుఖదుఃఖములు)న్నట్లూ ప్రత్యక్షముగా ఋజువు చేయబడినది. దుఃఖ మనుభవించు అంతఃకరణము లేక మనస్సు ఎంత అల్పాంశములో నైనను ప్రతిప్రాణియందున్నున్నదని చెప్పక తప్పదు. మనః ప్రాణముల చేరికయే

జీవత్వము. కనుక సర్వజీవోపాధులయందు మనఃప్రాణమ
లున్నవి. ప్రతిజీవియు తన పూర్వ, పూర్వ, కర్మల ననుసరిం
వివిధోపాధులు సృష్టించుకొనుచున్నది.

శరీరమున్నంతవరకు, మనఃప్రాణములున్ను, అవి అను
వించు దుఃఖమున్ను వుంటూనే వుండును. జాగ్రత, స్వప్నము
సుషుప్తి తురీయములను, నాల్గవస్థలలోను ఏదోఒక రూపములో
శరీరము లున్నవి. సుషుప్తి తురీయముల యందు మన
ప్రాణములు వున్నవిగాని మానసిక వృత్తిమాత్రములేదు. ఏ
ననగా అపుడు మనఃప్రాణములకు సంయోగములేదు. సాక్ష
త్తుగా సుఖదుఃఖము లనుభవించకుండా వున్ననూ, వాని కారణ
ములు బీజరూపంగా మనస్సునందుండును. మరణావస్థయంద
స్థూలశరీరముతో యెడబాటు కల్గి, మరియొక స్థూలోపాధి
సృష్టించువరకును కూడ, మనఃప్రాణ సంయోగ రూపమగ
వుపాధి (మనోమయకోశము) మిగిలియే యున్నది. కను
మనస్సున కావరణ రూపంగా నున్న ప్రాణమే, శరీ
మనదగును. మనస్సు సంకల్పము చేసిన వెంటనే యీ ఆవరణ
మేర్పడుచున్నది. యిదియే శరీర పరిగ్రహము.

ఈ శరీర పరిగ్రహమే ప్రథమ జన్మము. ఇదియే ప్రథమ
దుఃఖము అని చెప్పవలసియున్నది. మనస్సునకు యీ శరీ
పరిగ్రహము (లేక ప్రాణసంయోగము) యెపుడు ప్రప్రథమంలో
యేర్పడినది ? అది దురూహ్యం. అనాదియైన కాలముతోపాటే
యీ మనః ప్రాణసంయోగ మేర్పడినది. సృష్టికామన యనేది

(అంతకు పూర్వము నిస్సంకల్పరూపంలో నుండిన) పరమాత్మ కేనాడు కలిగినదో, ఆనాడే సంవిద్రూపంలోనున్న ఆ పరమాత్మ అఖండజ్ఞానము, మనోరూపమైనది, సంకల్పముచే చలనమునొంది ప్రాణావరణ మేర్పడినది. ఆమనః ప్రాణములతో జీవత్వ మేర్పడినది. కనుక "జీవోబ్రహ్మైవ నాపరః" (జీవుడు బ్రహ్మమే యితరంకాదు) అనవలసివచ్చినది. ఈ విధంగా యేర్పడిన జీవుడు, బ్రహ్మమునందు పూర్వపూర్వ సృష్టులయందలి తన సంస్కారాల రీత్యా పంచీకృత పంచమహా భూతములతోగూడిన ప్రపంచమున పంచతన్మాత్ర విషయములందు క్రమశః లోలత్వముచెంది నూతన సంస్కారము లేర్పరుచుకొని వివిధములైన స్థూలశరీరముల పరిగ్రహించుచున్నాడు. "వాసాంసి జీర్ణాని యథావిహాయ నవాని గృహ్ణాణి నరోపరాణి, తథాశరీరాణి విహాయజీర్ణా, న్యన్యాని సంయాతి నవానిదేహీ" అనగా చినిగిన బట్టలను విడచి క్రొత్త బట్టలను మనుజులెట్లు ధరింతురో, అట్లే పాతశరీరములను విడచి జీవుడు క్రొత్తశరీరములను ధరించుచున్నాడని, గీతావాక్యం.

నూతన శరీరంతో మాతృగర్భమునుండి వెడలిన జీవుడు స్వరూప విస్మృతి జెంది, స్థూలశరీరమే తాననియెంచి (శరీరముతో తాదాత్మ్య భావనజెంది) భ్రాంతుడై, ఆ దేహమునకు సహజమగు పుట్టుట, చచ్చుట, వ్యాధివచ్చుట, ముసలితనం వచ్చుట, మొదలగు మార్పులలోనూ, భార్యాపుత్రాదుల వలననూ, కలుగు దుఃఖములన్నియూ అనుభవించుచున్నాడు. తానే ఆ దుఃఖాదులకు కర్త, భోక్తయని భావించుచున్నాడు.

ప్రథమ శరీరధారణతో (ప్రాణ సంయోగముతో) ప్రారంభమైన యీ దుఃఖములు మరణంతోకూడ సమాప్తి చెందక సంస్కారరూపముగ మనస్సున హత్తుకొని స్థూలశరీరము లేనికాలమునకూడా జీవునికి వేదన కల్గించుచున్నవి. సుషుప్తిః మూర్ఛ, సమాధ్యాది అవస్థలయందు మాత్రమే తాత్కాలిక మగు దుఃఖశాంతి కల్గుచున్నది. "శుద్ధే సుషుప్తి దృష్టాంతం" అని చెప్పబడిన రీతిగా సృష్టికి పూర్వమున్న అఖండ బ్రాహ్మి స్థితిలోని సంకల్ప స్థితిలో, ప్రాణసంయోగము లేనందున, తత్కాలమందు మాత్రము ప్రాణసంయోగము లేదు. కనుక సుఖదుఃఖాది ద్వంద్వములు లేవు. కాని ఆ శుద్ధబ్రహ్మము తిరిగి సంకల్పంచేసి ప్రాణావరణ రూపంపొందు అవకాశం సహజమై యుండుటచే, అదియును దుఃఖమునకు అత్యంత నివృత్తి స్థానముకాదు. అఖండ యెరుక అని దానికి నామకరణము చేయ వచ్చునేగాని అది యెరుకయేలేని పరిపూర్ణ పరబ్రహ్మముకాదు. పరిపూర్ణ రాజయోగ (లేక సహజామనస్క రాజయోగ) విధానమునందు కాని దుఃఖనివృత్తికాదు.

అట్టి పరిపూర్ణబ్రహ్మ విషయమగు బోధకు మానవుడే అధికారి. ఏలననగా అధిష్ఠాన చేతనబ్రహ్మమునకు మానవుడే అత్యంత సన్నిహితుడు. స్వస్వరూపంలో మానవుడే పరమాత్మ. తొలుదొల్త ప్రాణముతోను తదనంతరం జీవోపాధులతోను చివరకు స్థూలశరీరములతోను తాదాత్మ్యభావన పొంది దుఃఖము ననుభవించునేగాని నిజముగా నాతడు పరమాత్మయే. పరిపూర్ణ

బోధచే మానవజన్మ యుండగానే సర్వభ్రాంతులను దుఃఖము లను అధిగమించి శరీరస్థితి బొందగలడు. కర్తృత్వ రహిత విధానముగ ప్రవర్తించి జన్మరాహిత్యమే చేసుకొనగలడు. మానవున కసాధ్యమగునదేదీలేదు. విశ్వామిత్రునివలె మరియొక స్వర్గము సృష్టించగలడు. అగస్త్యునివలె సముద్రమునే ఆపోశనపట్టగలడు. హనుమంతునివలె మహోవార్నిధి లంఘించగలడు. అష్టసిద్ధులు పొందగలడు. త్రిలోకసంచారము చేయగలడు. తన మనో దృక్పథము యొక్క మార్పుతో మానవుడీ లోకమును, స్వర్గ తుల్యముగానూ, లేక నరకతుల్యముగానూ కూడా చేసుకొన గలడు. కనుకనే "దుర్లభం మానుషం దేహం" అని చెప్ప బడింది. ఇట్లనంత శక్తివీర్యములుగల మానవజన్మ దుఃఖ స్వరూపమని భావించుటవలన మానవుడు నిస్పృహా నిరాసలకు లోనై, పురుషకారము నెరపక భ్రష్టుడు కాగలడు. బుద్ధీంద్రియములేని మిగతా జీవుల జన్మలు దుఃఖప్రదములు. పరిపూర్ణ బోధయందు గల కర్తృత్వరహిత కర్మకౌశలము నెరుగని మానవజన్మం పశుతుల్యమే గనుక అదియును దుఃఖప్రదమే యనవచ్చును. జన్మదుఃఖం అన్నారుగదా! మానవజన్మ కూడా జన్మేకదా అని సందేహింపవచ్చును. గాని జన్మతః దుఃఖ రూపమే అయినా, సత్యాసత్య నిర్ణయం చేయగల తన బుద్ధిని సద్వినియోగం చేసుకొని, సద్గురువులచే పూర్ణబోధ దెలిసి అశరీరపద్ధతిలో నుండగలడేని, అట్టి మానవజన్మ మాత్రమే దుఃఖరూపంకాదు. మానవులందరిజన్మ సుఖరూపమే అగునెడల మరల మానవుడుగా పుట్టుటకే అభిలషించునుగాని జన్మరహితం

కోరుటెందుకు ? అంటే మరల మానవజన్మయే సిద్ధించునను నమ్మకమేది ? ''గహనా కర్మణౌగతిః'' అనగా కర్మగతి నిర్ణయించుట యసాధ్యము. కనుకనే ''ఇహాచేదవేదీ బహుసత్యమస్తి, యిహాచేన్నవేదీ మహతీ వినష్టిః'' అనగా వుత్కృష్టమగు యీ మానవజన్మయందే (పూర్ణబోధ) సత్యమును తెలిసికొని జన్మరాహిత్యమును చెందడేని, మానవజన్మ వృధా చేసుకొని మహత్తరమైన నష్టమును పొందునని భావము. కనుక యీ వర్తమాన మానవజన్మ కల్గిన మహదవకాశమును జారవిడువకూడదు. శ్రీ గౌడపాదాచార్యులువారు మాండూక్య కారికలలో ''ననిరోధో, నచోత్పత్తి, ర్నబద్ధో నచ సాధకః నముముక్షుర్నవై ముక్తి ఇత్యేషా పరమార్ధతా॥'' అనగా, ఉత్పత్తి ప్రళయములుగాని, బద్ధ, సాధక ముముక్షు, ముక్తులుగాని పారమార్ధికముగ లేనేలేవన్నారు. కనుక అసలు దుఃఖమేలేదు అని చెప్పవలసి వుండును. కనుక తన్నివృత్తికి ప్రయత్నము పురుషకారము అవసరమేలేదు అనే నైరాశ్యభావ ముదయించును. కనుక సమాజశ్రేయస్సును కోరినవార ట్లనరాదు. పిపీలికాది బ్రహ్మపర్యంతం (కారణ బ్రహ్మముతోసహా) దుఃఖమే గానవచ్చుచున్నది. కనుక దుఃఖము లేదనరాదు. దుఃఖమనుభవించు తానేలేడు. (పరిపూర్ణ పరబ్రహ్మమునందు) తాను లేని ఆ రిపూర్ణ పరబ్రహ్మమును గురుముఖతః విచారించి సర్వభ్రాంతిహితము చేసుకొనవలెనని అచలఋషుల సిద్ధాంతము.

జ్ఞానమార్గము, మధ్యేమార్గము యివన్నియు నిష్ప్రయోజన ములే. బ్రహ్మసత్యం, జగన్మిథ్యాయను వాక్యము గ్రుడ్డిగా నమ్మి, మానవుని స్వప్నమెట్లు అబద్ధమో అట్లే జగత్తున్ను అసత్యమని నిర్ణయించుట అతి విచిత్రముగా నున్నది.

జగత్తులోని అనుభవములలో స్వప్నానుభవము చాలా విలక్షణమైనది. తాత్వికముగ యోచించినచో మాత్రమే తెలియ బడుచున్నది. అన్నముయొక్క సూక్ష్మాంశము మనస్సు, జలము యొక్క సూక్ష్మాంశము ప్రాణము. (శ్రుతి - అన్నమయగ్ హి సోమ్యమవ, ఆపోమయః ప్రాణ, స్తేజోమయీ వాక్ - ఛాందో. 6-5-3.) యీ మనః ప్రాణముల రెంటికలయికే జీవ త్వము. సూక్ష్మ శరీరము, లింగశరీరము జాగ్రతయందు, ఆకలి దప్పుల కన్నపానాదులు, నివాసమునకు గృహారామ క్షేత్రాదులు, శృంగారమునకుభూషణాదులు, జ్ఞానాభివృద్ధికి విద్యావివేకములు కలిగి సుఖాదులు బొందుచుండును. స్వప్నావస్తయందు మనః ప్రాణములు కూడియే యుండును. కాని శబ్దాదివిషయ పంచక రూపమగు వస్తుసామాగ్రిలేదు. ఐనను మనస్సు కేవలం సంకల్ప రూపంగా గుర్తెరుగుచునే వుండును. వస్తురహిత సంకల్పపద్ధతి కనుక సంకల్ప రహితముతో స్వప్నదృశ్యములున్ను పోవు చున్నవి, కనుక స్వప్న మశాశ్వతమనీ అసత్యమనీ, అట్లుగాక జాగ్రదవస్తయందు సంకల్పం, వికల్పం పొందినా దృశ్య వస్తువులు లేకపోవుటలేదు కనుక అది శాశ్వతమనీ, సత్యమనీ,

నిర్ణయించబడినది. క్రియారూప వ్యవహారముగల జాగ్రద వస్తుకూ, క్రియారహితమై, కేవల భావనారూపమగు స్వప్న జగత్తునకూ సాటిచేయరాదు.

ఈ స్వప్న దృష్టాంతమును తీసుకొని, నరస్వప్నానికి జగత్తునకూ పోలికచెప్పి జగత్తు మిథ్యయనే నిర్ణయానికి మత కర్తలు దారి తీసినారు. మనకు కలలో కనుపిస్తున్నవన్నీ మిథ్య గనుక అల్లే జాగ్రదవస్తలో మనకు కనుపిస్తూన్నవన్నీ మిథ్యలే. "యదృశ్యం తన్నశ్యం". జగత్తుకనుపిస్తూంది, కనుక యిదీ మిథ్యమే. "జగన్మిథ్యాదృశ్యత్వాత్ స్వప్నదృశ్యవత్" అని సూత్రీకరించినారు. స్వప్న జగత్తు దృష్టిచేత సృష్టింపబడి తెలియ బడుచున్నది. అల్లే జాగ్రతయందు తెలియబడే సర్వజగత్తు దృష్టిచేతనే సృష్టింపబడుచున్నది. కనుక స్వప్నమెట్లు అశాశ్వ తమో అల్లే జాగ్రతయందు తెలియబడు సర్వస్వము అశాశ్వ తము, జగత్తు మిథ్యయని నిరూపించడానికి అద్వైతులు శ్రమ బడ్డారు.

ఐనా, మిథ్యయనగా అర్థము కేవలము అసత్యమనికాదు. పారమార్థికంగాలేనిదని మాత్రమే అర్థం. కనుక జగత్తుయొక్క నామరూపాలు మాత్రమే అసత్యము. "అస్తి, భాతి, ప్రియం, నామచేత్యం శపంచకం, ఆద్యత్రయం బ్రహ్మరూపం, మాయా రూపంతతోద్వయం" (వే. పం) అనగా అస్తి, భాతి, ప్రియ ములు మూడూ బ్రహ్మరూపము. రూపనామములు రెండూ మాయారూపం. "యామాసామాయ అనగా ఏదిలేనిదో అది

మాయ కనుక నామరూపాలు మాత్రమేలేనివి. ఐతే నామరూపములున్న చోటనే అస్తి, భాతి, ప్రియములున్నవి. కనుక యివన్నియు అవినాభావ సంబంధముకలవియే యగుచున్నవి. ప్రకారాంతరముగ చూచినచో అధిష్ఠానచేతనము కారణము. నామరూపాత్మికమగు జగత్తు కార్యము. కార్యకారణ వస్తు లక్షణములు వేరుగా నుండవు బ్రహ్మమేజగద్రూపమైనది. బంగారమే ఆభరణములుగాచేస్తే ఆభరణముయొక్క నామరూపాలు కల్గినవి. కనుక ఆభరణములుకూడా బంగారమే. బంగారం సత్యం ఆభరణాలు అసత్యం అని యెట్లనరాదో అట్లే కారణ బ్రహ్మము సత్యం కార్యరూపజగత్తు అసత్యము. నరస్వప్నము వంటిది అని అనరాదు.

జాగ్రదావస్థలోని వస్తువులు నామరూపాలు మారుచున్నవేగాని వస్తువు ఏదోరూపంలో వుండివుంటూనే వున్నది. ఏదో పేరుతో వ్యవహరింపబడుచునే వున్నది. ఆత్మనాశనము లేనిదన్నట్లే, పదార్థము కూడా అత్యంత నాశనములేదు అని అనకతప్పదు. స్వప్నపదార్థములట్లుగాక ఏ రూపంలోనూ ఏ పేరుతోనూ నిలిచియుండుటలేదు. కనుక నరస్వప్నమునకును జాగ్రత్ప్రపంచమునకును సాటిచేయరాదు.

"జగన్మిథ్యాదృశ్యత్వాత్ స్వప్నదృశ్యవత్" అంటె అర్థము జగత్తుకానవస్తూ వున్నది. కనుక స్వప్నదృశ్యమువలె మిథ్యయే అని అన్నారు. కనిపించేదంతా మిథ్యయనియంటే, కనుపించనిదంతా సత్యమే అన్నట్లేగదా! జగత్తులోనివే అయి

వున్న ఆకర్షణశక్తి, విద్యుచ్ఛక్తి మొదలగు శక్తులున్ను వాయువు, ఆకాశములున్ను కనుపించుట లేదుగదా! అవి యున్ను సత్యములే అని అనవలసివచ్చును. కనుక మిథ్యయనుటకు హేతువు కనుపించడమేనని అనరాదు.

అంతేకాదు, ఒకమానవునికే గల్గిన యీరోజు స్వప్నము మరునాడు రాదు. మరియూ అందుకు కేవలము విరుద్ధమైన స్వప్నము రావచ్చును. మరియూ ప్రపంచములో నున్న మానవులందరికీ ఒకే కాలమునందు ఒకే స్వప్నము రాదు. కొందరికి కొన్ని దినములు స్వప్నములే రాకపోవచ్చును. జాగ్రత్తలో అట్లుండుటలేదు. వందలకొలది సంవత్సరాలక్రితం కట్టబడిన కట్టడములు యీరోజునకున్ను ఒకే రీతిగా అందరికీ గోచరిస్తూవున్నవి

స్వప్నమునకొక మర్యాదా లేదు. స్వప్నగతి అనగా ముందేరీతిగా స్వప్నవృత్తాంతములు నడచునో, యెవరున్నూ స్వప్నకాలమునందు నిర్ణయింపజాలరు. జాగ్రత్ప్రపంచమున అట్లుగాక ముందురాగల సూర్యచంద్ర గ్రహణములు మొదలగు వానిని వర్షాకాల, శీతాకాల, వేసవికాలములను మానవుడు నిర్ణయించ గల్గుచున్నాడు. యిట్లనేక విధములుగా జాగ్రత్ప్రపంచములో ప్రకృతి నియమములనుబట్టి నియమబద్ధంగానడచు యీ విశ్వమందలి మార్పులను గుర్తింపగలుగుచున్నాడు. స్వప్నమునకు యే నియమమూ లేదు. యే నిర్ణయమూ లేదు. అర్ధరాత్రివేళ సూర్యుడుదయించినట్లు, తన శిరస్సు ఖండింపబడి

పై కెగిరి పోవుచుండగా, తానుచూచి ఏడ్చుచున్నట్లు, ఒకనెల క్రిందటనే పుట్టిన స్త్రీశిశువునకు భర్తలేకనే పదిమంది సంతానము కల్గినట్లు తాను మంత్రసాని పనులను జరిపినట్లు కల గనవచ్చును. కనుక జాగ్రత్ ప్రపంచమునకును కార్యకారణ సంబంధములేని స్వప్న ప్రపంచమునకును సాటిచేయరాదు.

జాగ్రదవస్థయందొనర్చిన కర్మలకు దృష్టాదృష్టఫలములు కలుగుచున్నవి. అనగా ప్రత్యక్షముగా కలుగు ఫలితములున్ను, పుణ్యపాప ఫలములున్ను కలుగునట్లు, స్వప్నము నందొర్చిన కర్మలకు పుణ్యపాప ఫలములు గలుగవు. ఉదాహరణకు ? స్వప్నమునందు, ఒక మనిషినినేను చంపినట్లు కలగంటిని. దానికి దృష్టఫలమగు కారాగారశిక్షగాని అదృష్టఫలమగు నరకముగాని నాకు సంభవించదు. కారణమేమి ? జాగ్రదవస్థయందు సంపూర్ణ మగు జ్ఞానముతో నేను గుర్తెరిగి చేయుచున్నాను. అట్లు గుర్తె రుగు జ్ఞానము స్వప్నమునందు లేనేలేదు. స్వప్నజాగ్రతలకు పోలికలకంటె భేదములే హెచ్చుగా కనుపించుచున్నవి. కనుక ప్రపంచము నరస్వప్నమువలె మిథ్యగాదు.

"జగన్మిథ్యా దృశ్యత్వాత్, స్వప్నదృశ్యవత్" అను సూత్రము. దృశ్యమనగానేమియో విచారించినచో న్యాయమగు అర్థమేమో తెలియగలదు. శ్రోత్ర, త్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణ ములను జ్ఞానేంద్రియములకున్ను, "మనస్సష్ఠాణీంద్రియాణి" అని చెప్పబడిన మనస్సునకున్ను గోచరమైన దంతయు దృశ్యమే యని అనదగును. "ఆత్మావా రే ద్రష్టవ్యో శ్రోతవ్య మంతవ్య,

నిధిధ్యాసితవ్యః" అనీ, "మనసైవేహాను ద్రష్టవ్యం" అనీ అనగా ఆత్మమనస్సుచే చూడదగినదని శ్రుతులు చెప్పుచున్నవి. కనుక ఆత్మకూడా దృశ్యకోటిలోనికే చేరుచున్నది. కాదు, ఆత్మ దృశ్యమనరాదు అది దృక్కు అని దానికి వేరే పేరిడినా, దృక్కు ద్రష్టదృశ్యములు అను మూడును ఒక త్రిపుటిలోనే చేరియున్నవి కనుక దృశ్యమువలె దృక్కున్ను స్వప్నవత్తుగా మిథ్యయే అని అనవలెను. కాని యిది నరస్వప్నము వంటిదిగాదు. ఇది సుర స్వప్నమువంటిది యని పూర్ణభావజ్ఞు లన్నారు.

పరిపూర్ణబోధ నిర్ణయానుసారముగా పరిపూర్ణ పర బ్రహ్మమునందు ఎరుకే లేదు కనుక ఎరుకయందు దోచుజగత్తున్ను అందలి దుఃఖమున్నూ లేదు కనుక పరిపూర్ణబోధజ్ఞుడు సుఖ దుఃఖాది సర్వద్వంద్వాతీతుడు, స్థితప్రజ్ఞుడు, అని నిర్ణయం.

## రజ్జు సర్పభ్రాంతి

మిథ్యయైన జగత్తునకు వునికి యెలావుంటుంది? అనే ప్రశ్నకు ప్రధానంగా రజ్జుసర్ప భ్రాంతియొక్క దృష్టాంత మీయడం పరిపాటి. అనగా చీకటిలోవున్న త్రాటినిచూచి మనుష్యుడు పామని భ్రమపడతాడు. అది నిజంగా పామైతే కలిగే భయకంపాది వికారాలన్నీ కేవలం ఆ భ్రాంతివల్లకూడా కలుగుతాయి. యథార్థము తెలసినవారు, "యిది పాముకాదు, త్రాడే" నని చెప్పగానే ఆ భ్రమ తొలగి భయాదులు తొలగు తాయి. ఈ విధంగానే త్రికాలాబాధ్యమైన ఆ బ్రహ్మపదార్థము నందు జగత్తు భాసిస్తుంది. ఇందుకు కారణం అజ్ఞానము. బ్రహ్మ

పదార్థంతప్ప యావత్తు జగత్తూ మిధ్యయని తెలిసినవారు యీ పద్ధతిగా నిరూపించిజ్ఞానబోధ చేయడంచేత బ్రహ్మజ్ఞానము కలుగుతుంది. ఆక్షణంలోనే జగద్భ్రాంతి తొలగుతుంది.

## దీనియందలి అపవాదము

రజ్జువునకూ (త్రాటికీ) సర్పమునకూ స్వరూప సామ్య మున్నట్లుగా, బ్రహ్మపదార్థానికీ జగత్తునకూ సర్వవిషయాల లోనూ భేదమేగాని యెట్టి స్వరూపగుణ సామ్యాలులేవు. ఎవరికి భ్రమకల్గినదంటే యితరులుగాని యితర సామ్యపదార్థము గాని యచ్చట లేనేలేదు కనుక వారు నిర్ణయించుకొన్న బ్రహ్మ మునకే భ్రమకలిగి యుండవలె. అట్లనరాదుగదా! బ్రహ్మము కాదు. మరొకరు భ్రమించినారనే మాటంటే, అందువల్ల అద్వైతహాని సిద్ధించును. ఇట్టి పరిస్తితులలో దృష్టాంతమును నమ్మి తృప్తిచెందవలెనేగాని, ద్రాష్టాంతమునుగూర్చి విచారించ గూడదని వేదాంతశాస్త్ర నిర్ణయము. వారి నిర్ణయానుసారము. అదిష్ఠాన కూటస్థ స్వయంప్రకాశ వస్తువు అనగా మహాకాశమే బ్రహ్మము.

## పరమాత్మయే మానవుడుగా సృష్టిఅయినాడా ?

ఎవరి యిచ్ఛవలన మానవుడు సృష్టిఅయినాడు ? "ఇచ్ఛా మాత్ర ప్రభుసృష్టిః" అని "సోఽకామయత బహుస్యాం ప్రజా యేయ" అనగా పరమాత్మ తన యిచ్ఛచే అనేకులుగా కావలెనని సంకల్పించెను. ఎందుకొరకు సృష్టించెను ? లోకరక్షణకొరకు, తమ సంతానమును పోషించుకొఅకు, తలిదండ్రులు అనేక

విధానములు సంకల్పించుకొని తమ సంతానమునెట్లు పోషించు కొందురో, అట్లే పరమాత్మ లోకరక్షణకొరకు ముఖ్యముగా తనవంటి మానవలోకమున కంతటికీ శ్రేయస్సు కల్గించుననే కోరికతో "ఆత్మావై పుత్రనామాసి" అనే రీతిగా తన సంపూర్ణ కళలతో పరమాత్మ మానవుని సృష్టించెను. అనగా తానే మానవోపాధిగా రూపొందెను. ఎందునిమిత్తమనగా తన కార్యము (మానవ లోకరక్షణ)గావించుటకొరకు. ఇది యెట్లు సాధ్యము? ధర్మాచరణ పద్ధతులు సంపూర్ణముగా పాటించుచూ, వివేక జ్ఞానముతో లోకశ్రేయస్సునకై స్వార్థమయ జీవితము విడనాడి త్యాగమయ జీవిత విధానముపూని మానవలోకమునకు ఆదర్శ ప్రాయుడై జీవితము నడపినచో అదియే మానవుడు గావించు లోకరక్షణ, "యద్యదాచరతి శ్రేష్ఠ స్తదేవేత రేజనాః" అను న్యాయంగా, తాను తరించి యితరులను తరింపచేయుటయే ఆతడు చేయు లోకరక్షణ, లేక లోకసేవ, మానవలోక రక్షణ మానవుడే చేయగలడు. ఇతరోపాధులేమియు చేయజాలవు. మానవుల రక్షింపజాలవు. పరమాత్మ తన రక్షణకొరకు (తానే అయిన తన సృష్టిలోని ప్రాణులను రక్షించుటకొరకు) తానే మానవుడైనాడు. కనుకనే "దుర్లభం మానుషం దేహం" అని చెప్పబడినది.

## రాజవిద్య నిర్ణయము

మహాకాశమగు అధిష్ఠాన చేతనముగా సృష్టిచెందిన స్త్రీ పురుషులు, వివాహపద్ధతుల నవలంబించి, పాతివ్రత్యధర్మమును

స్త్రీయును, ఏకనారీవ్రతమును పురుషుడును, అనుష్ఠించి సంతానముఁగని లోకకల్యాణకరమగు సత్కర్మలనే ఆచరించవలెను.

తానుండు పరిసరములయందు ప్రజలు సత్కర్మాచరణ పరులై ధర్మమాచరించుట కనుకూలముగా, తన వర్ణాభిమానము, తన ధనకనక వస్తువాహనాది సంపదలయొక్క అహంకారాభిమానముఁలు విడువ వలయును. అనగా వర్ణ వ్యవస్థయందు వుత్తమ వర్ణస్తుడననిగాని, సంపన్న కుటుంబీకుడననిగాని అహంకారాభిమానములకు వశుడుగాక, తాను నివసించే ప్రాంతమందుండు తక్కువ కులస్తులనుగాని దారిద్ర్యముచే బాధపడువారినిగాని చూచి వారు హీనులని, తాను గొప్పవాడనని యెంచక వారి క్షేమముఁకొరకు, కులమదము, ధనమదము వదలి, వారి క్షేమమును విచారించుచూ, వారిని లక్షణయుతులుగా నొనర్పవలెను. బంగారము కొందరివద్ద హెచ్చుగానున్నను, మరికొందరి వద్ద తక్కువగా యున్ననూ, అంతయు బంగారమే అను నిశ్చయము మాత్రం యెట్లు పరమసత్యమో అట్లే మానవులు వారి వారి పరిస్తితులయందు కొద్ది గొప్ప, పెద్ద చిన్న అను తారతమ్యములున్నను, ఆకలిదప్పి నిద్ర జనన మరణము లనేవి సర్వులకు ఏకమని వారలకు బోధించి, అంతఃకరుణ సంకుచిత భావములనుండి వారిని విడిపించి ధీరుల నొనర్పవలెను. గ్రామ శ్రేయస్సునకై, వీధి అభిమానము, విడువవలెను. దేశరక్షణకు గ్రామాభిమానము విడువవలెను. ఆత్మరక్షణకు సర్వాభిమానములను విడువవలెను. మతప్రబోధకులు, స్వర్గవైకుంఠ కైలాసాదుల

యందుండు దేవతలను నవవిధ భక్తిమార్గములచే సేవించినచో పుణ్యముకలిగి మోక్షముకలుగునని బోధింతురు. వారి పద్ధతులు విడనాడి, చతుర్విధ శుశ్రూషా విధానములను పరిపూర్ణ నిజ గురువులచే తెలుసుకొని తామాచరించి సోదరమానవులచే ఆచరింపచేయవలెను.

## ఆత్మనిర్ణయము - శుశ్రూష పద్ధతి

శ్రు : "ఏకోదేవస్సర్వ భూతేషుగూఢః"

అనే న్యాయమున మహాకాశమగు స్వప్రకాశచేతన పరమాత్మ, పిపీలికాది బ్రహ్మ పర్యంతము సర్వభూతములయందు గూఢముగానున్నది. అనగా పంచకోశములకు అధిష్ఠానమై ప్రత్యగ్రూప హిరణ్మయ కోశముగానున్నది. అది మానవోపాధియందు త్రికరణములగు మనోవాక్కాయ ప్రవర్తనలను తనకావారముగా నిర్ణయించుకొని యిహా పరవ్యవహారములు జరిపించుచున్నది. ఈ త్రికరణములను పరమాత్మపద్ధతిగా ప్రవర్తింపనీయక, ఆదిభౌతిక ఆధిదైవిక, ఆధ్యాత్మపద్ధతులు ప్రవర్తింపజేసిన యెడల ఆత్మ పాపాత్మగామారి నీచయోనులయందు జన్మాదులు పొందును. కనుక ఆత్మయందు ప్రేమకలిగి త్రికరణములను పరమాత్మ పద్ధతిగా ప్రవర్తింపజేయడము ఆత్మశుశ్రూషయని చెప్పబడును.

## అంగనిర్ణయము - శుశ్రూషా పద్ధతి

పంచభూతాంశముల చేరికచేత అంగము (స్థూల శరీరము) యేర్పడుచున్నది. నరములు, అస్తులు, చర్మము మాంసము

నఖరోమములు భూమియొక్క అంశములు. రక్తము స్వేదము శుక్లము మూత్రము శ్లేష్మము జలభూతాంశములు. ఆకలిదప్పి నిద్ర ఆలస్య సంగమములు అగ్ని అంశములు. చాచుట నడచుట దాటుట వణకుట పరుగుట వాయువంశములు; కామము క్రోధము లోభము మోహము భయము ఆకాశాంశములు; ఈ పద్ధతిగా నిర్మాణమైన శరీరము అంగ మనబడును. దీనియందలి ఆకాశాంశములగు కామక్రోధ లోభ మోహభయములు దేహాభి మానపద్ధతి గల్గించి, అధోగతి గలిగించును. కనుక వానియందు పరమాత్మ పద్ధతి నిర్ణయించుకొని, భూమికిగల ఓర్పు వహించి, తాను ప్రవర్తించి యితరులను ప్రవర్తింపచేయుట అంగ శుశ్రూష యని నిర్ణయము.

## స్థాన నిర్ణయము – శుశ్రూషా పద్ధతి

స్థావర జంగమ జీవోపాధులయందు, దుర్లభమైన మాన వోపాధియొక్క స్థానము పరమాత్మస్వరూపము, జ్ఞానేంద్రియ ములచే విషయ పంచకము దెలసి, అంతఃకరణమందు సత్యాసత్య నిర్ణయము గావించుకొని, సత్యపద్ధతిగా ప్రవర్తించుటయే స్థాన శుశ్రూష. "ప్రాణమేవ పరిత్యజ్య, మానమేవాభిరక్షతు" అను నిర్ణయానుసారము, ఆకలిదప్పులు ధర్మములుగాగల ప్రాణము పోయినా, అన్నపానాదుల కాసించి పరమాత్మపద్ధతిగల శుశ్రూ షకు భంగము కలుగకుండా ప్రవర్తించడము స్థాన శుశ్రూష యని నిర్ణయము.

## భావనిర్ణయము - శుశ్రూషా పద్ధతి

సృష్టికి కారణమగు పరమాత్మ తానేగనుక, మత్స్యావతారమునుండి క్రమపరిణామములో దుర్లభమైన మానవోపాధిగా సృష్టింపబడి అతి దుర్లభమైన పరిపూర్ణ నిర్ణయము జన్మరహిత విధానము గురుమూర్తిచే తెలుసుకొనక చనిపోయినచో తిరిగి జన్మములు పొందవలయుననే నిర్ణయముపైన గురుమూర్తిని ఆశ్రయించి జన్మరహిత పద్ధతి తెలుసుకొని ఆ భావమునందే ప్రవర్తించడము భావనిర్ణయము. అట్లుచేయక దారిద్ర్య సంబంధమగు బాధలు, శ్లేష్మ వాత పిత్త సంబంధమగు రోగబాధలు "అపుత్రస్య గతిర్నాస్తి స్వర్గో నైవచ నైవచ" అనగా సంతతి లేనందున స్వర్గము నాకు లభ్యముకాదనే మానసిక బాధలు యనుభవిస్తూ, సంతానప్రాప్తికొరకు నవగ్రహా పూజలు, నాగప్రతిష్టలు, పుత్రకామేష్టి, ధనాకర్షణకు లక్ష్మియుపాసనలు, పుణ్యలోక ప్రాప్తికొరకు తీర్థాటనములు, పిండ ప్రదానములు, గోప్రదక్షిణలు, అశ్వర్ధ ప్రదక్షిణలు, చిత్తవృత్తి నిరోధమునకు ఆసన ముద్ర లభ్యాభ్యాసములు, యీభావమునకు విరుద్ధములు, ఇవన్నియు, నీ పరమాత్మ భావమునకు భంగము కలిగించును.

"సీతారామాంజనేయ సంవాదమను" గ్రంధమందు,

తే॥గీ॥ రాజయోగంబు ముక్తికి రాజపథము
రాజ గుహ్యంబు పరమంబు రాజవిద్య

నదియు మూడువిధంబుల నలరుచుండు
సాంఖ్యతారక సదమనస్కముల నంగ॥,

అనియున్నది.

కాని సాంఖ్య తారకామనస్కములు తెలుసుకొన్న ఆంజ నేయుడు యీ పద్ధతులయందు మనస్సు మిగిలియే యున్నది గనుక అమనస్కమనే మాట చెల్లదని యాక్షేపించినాడు.

అరూపమనోనాశనము, స్వరూపమనోనాశనము, లేని పద్ధతులను "రాజవిద్య రాజగుహ్య యోగమని" చెప్పవలను పడదు. సాంఖ్య తారక అమనస్కములు రాజవిద్యయనీ, వాని సాధన పద్ధతియే రాజగుహ్యమని చెప్పి మానవులను భ్రమింప చేయుట మహాదోషము.

భగవద్గీత యందు రాజవిద్య రాజగుహ్య యోగమని యొక అధ్యాయమున్నది. అందు కృష్ణపరమాత్మ, అర్జునునకు ప్రబోధించిన విధానమును విడచి ద్వైతాద్వైత విశిష్టా ద్వైత మతకర్తలగు మధ్వ శంకర రామానుజులు వారి వారి మతాను సారము భాష్యములు వ్రాసి దాని నిజస్వరూపమును మార్చి యున్నారు. వారి భాష్యనిర్ణయములు రాజవిద్య రాజగుహ్య యోగమని చెప్పవీలుండదు. ద్వైత, విశిష్టాద్వైత, నిర్ణయ పద్ధతులకు అతీతమైనది, మోక్షమునకు ప్రత్యక్ష సాధనమని అద్వైతసిద్ధాంతముయొక్క నిర్ణయము, కాని అద్వైతుల నిర్ణయమున్ను రాజవిద్య రాజగుహ్య యోగము కానేరదు.

అదియే అగునని నిర్ణయించినయెడల మానవ లోకమును భ్రాంతిలోముంచిన వారమే యగుదుము.

ఎలననగా

"బుద్ధిగ్రాహ్యామతీంద్రియం" అనగా అధిష్ఠాన బ్రహ్మము బుద్ధికి గ్రాహ్యామగుచున్నది. "అహంబ్రహ్మాస్మి" యను వాక్యార్థానుభవమున బుద్ధి వ్యాపకము జెందినను, ఐక్యాపద్ధతి యందు బుద్ధివృత్తియే నశించుచున్నదిగాని నేను బ్రహ్మనను కొన్న బుద్ధి ఆ బ్రహ్మమునందు ఐక్యము కావడంలేదు. అది నశించుటలేదు. కనుక అద్వైతపద్ధతి రాజవిద్య రాజగుహ్యా యోగమని చెప్పుటకు వీలులేదు. వార్తిక నిర్ణయమునుగూడా రాజవిద్య రాజగుహ్యా యోగమనుటకు పొసగదు. ఎలననగా వార్తిక విధానమునందు శ్రవణాదులు లేకున్నను, నేను బ్రహ్మ ననే నిర్ణయము స్థిరముగా యుంటున్నది. "నిర్ణయోనాస్తి సర్వదా" అను న్యాయంగా ఏ నిర్ణయములు గావించినా జన్మ రహితం కాబోదు, కనుక వార్తిక నిర్ణయముగూడా రాజ విద్యరాజగుహ్యామని చెప్పరాదు.

## పరమాత్మ శక్తియొక్క కాలనిర్ణయము

శ్లో॥ చతుర్యుగ సహస్రాణి, దినమే కంపితామహః
పితామహా సహస్రాణి, విష్ణోర్ఘటిక మేవచ (1)

విష్ణోరేక సహస్రాణి, ఫలమేకం మహేశ్వరం
మహేశ్వర సహస్రాణి, శక్తిరర్ధఫలం భవేత్ ॥ (2)

అనగా కృతయుగము యొక్క కాలపరిమితి 17,28,000ల సంవత్సరములు. త్రేతాయుగము యొక్క కాలపరిమితి 12, 96,000ల సంవత్సరములు. ద్వాపరయుగము యొక్క కాల పరిమితి 8,64,000 ల సంవత్సరములు. కలియుగముయొక్క కాలపరిమితి 4,32,000 ల సంవత్సరములు. ఈ నాలుగు యుగ ముల పరిమితి చతుర్యుగ పరిమాణమగును ఇట్టి చతుర్యుగములు 1000 అయినచో చతుర్ముఖ బ్రహ్మకొక దినమగును. ఇట్టి బ్రహ్మకల్పములు వేయిగడచినమీదట విష్ణువునకు ఒక ఘడియ యగును. ఇట్టి విష్ణువులు వేయిమంది గడచినమీదట మహేశ్వరున కొక రెప్పపాటు కాలమగును. ఇట్టి మహేశ్వరులు వేయిమంది గడచిపోయిన మీదట శక్తికి ఒక్క రెప్పపాటు కాలమగును. పరమాత్మశక్తి యొక్క కాలనిర్ణయము వేదశాస్త్రములయందు యీ ప్రకారముగా నిర్ణయింపబడినది. ఇట్లు నిర్ణయించిన కారణ మేమనగా అగ్నిని విడచి అగ్నిశక్తి యెట్లుండదో, అట్లు సృష్టికి కారణమైన ఆదినారాయణుని విడచి, ఆతని సంకల్ప ముండదు. ఆతడు సంకల్పించుచునే యుండును. సృష్టి జరుగుచునేవుండును. అందువలన శక్తి నశించుననే నిర్ణయములేదు. దానికి కారణమగు పురుషుడు నశించిన, ఆతని సంకల్ప రూపశక్తి నశించును. పురుషుడు స్వయం సంకల్పరూపుడు. గనుక తనంతటతాను నశించడు. అందువలన సృష్టివిధానము నందుండి పరమాత్మ రూపమగు స్థూల, సూక్ష్మకారణ, మహాకారణ, శరీరాభి మానుల కన్న నేను మిన్నయగు కైవల్యాశరీరధారిని అనుకున్నా భ్రాంతి నశించదు. కనుక పరమాత్మపద్ధతిగా సృష్టిజెందిన మానవుడు

చతుర్విధశుశ్రూషల ననుసరించి, తనయందుతాను ఏక్యపద్ధతిగా ముక్తిచెంది, అచల పరిపూర్ణ అపరోక్ష నిర్ణయమునందు తన మూలరహితమునకు ప్రయత్నించడము రాజవిద్యయని నిర్ణయము.

## రాజగుహ్య నిర్ణయము

పంచీకృత పంచభూతములు జీవుల శరీరములకు అవరణముగా నున్నవి. పంచభూతములకు ఆవరణ రూపంగా పంచతన్మాత్ర లున్నవి. పంచతన్మాత్రలకు సూక్ష్మరూపంలో పంచాకాశములున్నవి. వీనికి అంటక అతీతముగా బాహ్యాంతర నిర్ణయము లేక "తేజోంధకార రాహిత్యం అచలోయం సనాతనః" అని చెప్పబడ్డ పరిపూర్ణ పరబాహ్యామేదో అది రాజగుహ్యామని నిర్ణయముగాని శ్రవణమనన రహితపద్ధతిగా తెలియుచున్న వార్తిక నిర్ణయబ్రహ్మము, మహావాక్య నిర్ణయపద్ధతిగా నిర్ణయించిన ప్రజ్ఞానబ్రహ్మము, సచ్చిదానంద స్వరూప లక్షణములు గల చేతన బ్రహ్మము సాంఖ్యతారకా మనస్క యోగములవలన తెలియబడు ప్రత్యగాత్మ బ్రహ్మము రాజగుహ్యామని నిర్ణయించుటకు వీలులేదు. ఈ పద్ధతులవలన నిర్ణయించిన బ్రహ్మము, జన్మలకు హేతువైన కారణ బ్రహ్మము మాత్రమే. కనుక జనన మరణభ్రాంతి రహితమునకు అచల ఋషులు సిద్ధాంతంచేసిన పరిపూర్ణ పరబ్రహ్మమే గుహ్యాతి గుహ్యమై "నచతుర్గచ్ఛతి నవాగ్గచ్ఛతి నోమనః"అని చెప్పబడుచున్నది. ఈ పరిపూర్ణ బోధ పద్ధతి సద్గురువులవల్ల; వున్నదున్నట్లుగా తెలిసినవారే మానవ

లోకకల్యాణకరములగు, సర్వమానవ సౌభ్రాతృత్వము, అన్యోన్య సహకారము, ఐహికాముష్మిక పురోభివృద్ధికి అనుకూలమగు పద్ధతులు మానవలోకమునకు ప్రబోధించి, నరులను నారాయణు లుగా నొనర్చెదరు.

## కర్మనిర్ణయము

కర్మయనాది. మరియు అఖండమునై యున్నది. ఎట్లనగా శయనించుట, కూర్చొనుట, వుచ్ఛ్వాస నిశ్వాసలొనర్చుట మొదలగు కర్మలు మానవునికి జరుగుచునే యుండును. ఒక్కక్షణమైనా కర్మలు జరుగుట ఆగలేదు. వూరకయుండినను అదియును నొక కర్మరూపమే. కర్మమంచిదైనా చెడ్డదైనా, "అవశ్యమను భోక్తవ్యం, పూర్వకర్మ శుభాశుభం" అని చెప్పబడినరీతిగా, దాని ఫలములను భోగించుటకొరకు మానవుడే జన్మనైనా యెత్తుటకు సిద్ధముగా నుండవలసినదే. కర్మమనాదియు, నఖండము, నగుటచే దాని అఖండ వ్యాపారమగు సృష్టి, స్థితి, లయాదులను పరమేశ్వరుడైనా ఆపలేడు. నేరస్తుని శిక్షించకుండా విడచి పుచ్చుటకు న్యాయాధిపతికెట్లు స్వతంత్రము లేదో, అట్లే పరమేశ్వరుడుగూడా కర్మాను భవమునుండి జీవుని తప్పించుటకు స్వతంత్రించడు. ఆ పరమేశ్వరుడే కర్మకధీనుడై తనధర్మములను నిర్వర్తించవలసివున్నది. జన్మాదులకు కారణమగు సంచిత కర్మఫలము లనుభవించుటకు యేజన్మయందనుభవించుటకు యోగ్యములో, ఆ జన్మయెత్తి యందా పాప పుణ్య ఫలము లనుభవించవలయును. గనుక పశు, పక్షి, క్రిమి, కీటక జన్మలెత్తి

మానవుడు తాను చేసిన కర్మఫలము లనుభవించవలెను. ఈ జన్మల ఫలానుభవమంతయు, ఒక్కమానవ జన్మయందే అనుభవించి తీర్చుటకు సాధ్యముకాదు.

శ్లో॥ కదాచిత్సుకృతం తాత కూటస్థ మివీతిష్ఠతి
మజ్జమానస్యసంసారే యావద్దుఃఖాద్విముచ్యతే ॥మ|భా॥

అనగా మానవుడు సంసార దుఃఖములనుండి సంపూర్ణముగా విముక్తుడగువరకు, తానొనర్చిన పుణ్యఫలము, తనకు సంక్రమించుటకు వేచియుండి స్థిరముగానుండును (పరాశరగీత). కనుక కర్మసిద్ధాంతపద్ధతి ననుసరించి యీ మానవ జన్మయే, తుది జన్మయని నిర్ణయించరాదు. ఒక్క పరిపూర్ణ బోధచేతనే సర్వసంసార మూలము నశించి, సద్యోముక్తి నందగలడని నిర్ణయము.

## జ్ఞాన నిర్ణయము

ప్రపంచ పారమార్థిక సౌఖ్యములకొఱకు, వేదముల లోనూ, స్మృతులలోను నిర్ణయింపబడి చేయబడే యజ్ఞయాగాదులవలన స్వర్గలోకప్రాప్తి కలిగినను, "క్షీణేపుణ్యేమర్త్యలోకం విశంతి" అను గీతావచనానుసారం, ఆ పుణ్యకర్మఫలము అనుభవము వలన క్షీణించి నశించినంతనే మానవలోకమున తిరిగి జన్మించక తప్పదు కనుక కర్మబంధమునుండి తొలగి అమృతత్వమును పొందుటకిది మార్గముకాదు. జననమరణ కర్మబంధము నుండి విడిపోయి అమృతత్వమును పొందుటకు శాస్త్రానుసారముగా జ్ఞానమనునదొక్కటే మార్గము.

1. "జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతేర్జునా !" అనగా జ్ఞానమను అగ్నిచే అఖిల కర్మఫలములను దహింపుమని గీతా ప్రబోధము.

శ్లో॥ బీజాన్యగ్న్యుపదగ్ధాని, నరోహంతి యధాపునః
జ్ఞాన దగ్ధైస్తధాక్లేశై ర్నాత్మా సంపద్యతేపునః॥

అనగా వేయించబడిన గింజ లేతీరున మొలకలెత్తవో ఆతీరుననే జ్ఞానమను అగ్నిచే కర్మలయొక్క క్లేశములు దగ్ధము లగునేని యాత్రలు మరల వుత్పత్తి జెందవు.

2. "య ఏవం దేదాహం బ్రహ్మాస్మీతి సయిదం సర్వం భవతి." అనగా నేనే బ్రహ్మగా నున్నానని యెవడు తెలుసుకొను చున్నాడో వాడే బ్రహ్మమగుచున్నాడు.

3. "జ్ఞాత్వాదేవం ముచ్యతే సర్వపాశైః"

అనగా, పరమేశ్వరునియొక్క జ్ఞానము కలిగినపిదప సర్వ పాపములనుండి విముక్తుడగును. తామరాకుల కుదకమంటనట్లు బ్రహ్మజ్ఞానునకు పాపములంటవు. ఈ విధంగా జ్ఞాన మాహాత్మ్య మును ప్రతిపాదించు వాక్యము లనేకము లున్నవి. శాస్త్రదృష్టిచే విచారించి చూచినను యీ సిద్ధాంతమే దృఢమగును. కారణమే మన దృశ్యసృష్టియందున్న పదార్థములన్నియు, కర్మమయము లైననూ, యీ సృష్టికాధారమగు పరబ్రహ్మయొక్కటే గనుక, ఆ పరబ్రహ్మజ్ఞానమే పొందవలెను. జ్ఞానమనగా వ్యావహారిక జ్ఞానముగాని, నామరూపాత్మక మగు సృష్టిలోని వస్తుజ్ఞానము

గాని కాదు బ్రహ్మైత్మైక్య జ్ఞానమని యర్థము. దీనినే విద్య అనెదరు. శ్రుతి :- "కర్మణాబధ్యతే జంతుః విద్యయాచ ప్రముచ్యతే." అనగా కర్మచే మానవుడు బద్ధుడగు చున్నాడనియు, బ్రహ్మైత్మైక్య జ్ఞానముచే, విద్యచే, ముక్తుడగు చున్నాడని అర్థము.

అచలపరిపూర్ణ పరబ్రహ్మమును, ఏ పద్ధతులు యిదమిద్ధమని నిర్ణయించి వాక్యపరిధిలో బంధింప జాలవు. అది నిర్లిప్తముగానే యుండును. అధ్యాత్మానుసారంగా యీ జగత్తునందుండు అఖిలపద్ధతులును (1) కర్మ (మాయ) (2) బ్రహ్మము, అను రెండు మార్గములుగా విభజించనగును. జన్మరహితమాసించువారు, కర్మ మార్గములను బ్రహ్మ మార్గములను పూర్తిగావదలి, పరిపూర్ణ బోధనాశ్రయించ వలసినదే. పరిపూర్ణ పరబయలు యెట్టిదో ముందుగా తెలుసుకొన వలసి యున్నది. కర్మ, బ్రహ్మమార్గములు రెండును మాయావరణములోనివే. పరిపూర్ణ పరబ్రహ్మముయొక్క నిర్ణయవిధానము ముందుగా తెలియక ఏదో పరిపూర్ణమని నిశ్చయించుకొన్న యెడల "వినాయకం ప్రకుర్వాణో రచయామాసవానరం" అనగా వినాయకుని విగ్రహము చేయబూని, దానిని చేయలేక కోతినిచేసెనన్న సామెతగా ముక్తుడగుటకు మారుగా పతితుడగును.

## పరిపూర్ణ పరబయలు నిర్ణయము

శ్లో॥ పూర్ణమదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణముదీర్యతే
పూర్ణస్యపూర్ణమాదాయ, పూర్ణమేవావశిష్యతే॥

ప్రత్యక్షపూర్ణముగా తెలియబడుచున్న ఆత్మ, పరిపూర్ణ పరబ్రహ్మమునం దైక్యపరచుటకు ప్రయత్నంచేయగా, అక్కైక్యము గాకుండానే, పోవుచున్నది. కనుక, పరిపూర్ణమునం దైక్య పద్ధతికి బదులు, పరిపూర్ణమునందే యాత్మలేనేలేదని, నిర్ణయించి, "మూలంలేని యీగుర్తెరిగే శరీరము యేమిలేదు" అని, శ్రవణ మనన నిధిధ్యాసలు చేయడం శ్రేయస్కరము. ఇట్లుగాక, మహా వాక్యార్థాను భవపద్ధతికొరకు, వార్తికపద్ధతిగానూ, ఆ బ్రహ్మ మేనను నిర్ణయములోనుంటే, ఆ పరోక్ష పరిపూర్ణమునందు, ఐక్యంగాక, తన నిర్ణయమే తనకు తెలియక, అధోగతి పాలగును. కనుక నిదురవచ్చేవరకు, చచ్చేవరకు, మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు అనియె, మననము చేయవలెను. ఈ పద్ధతి వలననే మరణ భీతి తొలగును. పరిపూర్ణమునందు తనకు ఐక్యమున్నదో లేదో అను దాని నిజము తెలుసుకోవలయును. ఐక్యమనేది అసంభవమనే సత్యము తాను పూర్తిగా తెలుసుకొని, పిమ్మట ఆ మార్గము విడువడేని, మోసపోయి, అనేక జన్మలెత్త వలసి యుండును. కనుక పరిపూర్ణ బోధనిర్ణయము గురునిచే గట్టిగా తెలుసుకోవలెను. అపుడు శ్రుతిలో చెప్పినరీతిగా "పూర్ణమేవావశిష్యతే" అనగా పరిపూర్ణమే స్వతస్సిద్ధముగా శేషించి యుండును. ఆ అచల పరిపూర్ణ పరబ్రహ్మము యే యితర వస్తువులలో లీనముకాదు. యితరమును తనయందు లీనము చేసుకోదు అనేది, సిద్ధాంతము. వస్తునిశ్చయ రూప విచారణయందుగూడా యీ సత్యమే తెలియబడుచున్నది. ఎట్లనగా జీవేశ్వర జగత్తులు సాక్షిచైతన్యమునందు యెన్ని పర్యా

యములు, సృష్టిస్థితిలయములు పొందినా, ఆ పరిపూర్ణ పరబ్రహ్మ మున కేలాటి సంబంధము లేనట్లు తెలియుచున్నది. కనుక జనన మరణ ప్రవాహముతో సంబంధపడియున్న యెరుక, జనన మరణ సంబంధములేని పరిపూర్ణ పరబ్రహ్మము నందెట్లు లయమగును ? కాబోదు, అని స్పష్టముగా తెలియుచున్నది. కనుక జనన మరణ భ్రాంతిరహితమునకు ప్రయత్నించు మానవుడు, అహంబ్రహోస్మి యను ఐక్యభ్రాంతిని, మాయారూపకర్మ భ్రాంతిని, విడువవలెను.

కం॥ కర్మమున బుట్టు జంతువు, కర్మమునను వృద్ధి బొందు కర్మమున జెడున్ । కర్మము జనులకు దైవము, కర్మము సుఖ దుఃఖములకు కారణమధిపా ! ॥

నామరూపాత్మక సర్వదృశ్య సృష్టికి, యేతత్వ మాధార భూతమైయున్నదో, అదే మనుష్యుని దేహమునందుకూడా ఆత్మరూపమున నివసించియున్నది. కాన మనుష్యుని కర్మా చరణ పద్ధతులు, దేహాత్మలరెంటి దృష్టితో విచారించి, కర్మ లాచరించవలెనని, స్వచ్ఛందులగు పరిపూర్ణ బోధజ్ఞులగువారు నిర్ణయించియున్నారు.

## ఆత్మస్వరూప కర్మాచరణపద్ధతి

అన్ని వుపాధులయందు ఆత్మ యేక రూపంగా నున్నందున ఆత్మనిర్ణయాను సారముగా యొనర్చిన కర్మలు పరతంత్రములుగా నుండవు. అట్లుగాక, ఉపాధి భేదమునుబట్టి ఆత్మ వేరై వుండే యెడల అది పరతంత్రమన జెల్లును. సృష్టివిధానమునందు అనగా ఆత్మపరిణామమునందే కలుగు శరీరాత్మలు రెండూ ఆత్మరూప ములే కనుక భేదపద్ధతిగా నిర్ణయించుటకే వీలులేదు. ఐననూ–

1. ఆత్మపంచతన్మాత్రల ప్రేరేపణ యందుండును. అనగా ఆత్మపంచతన్మాత్రల ఏకైక రూపమగుటచే సమష్టి శ్రేయోదాయక కర్మలయందు ప్రవర్తించుటకే ప్రేరేపించును. మరియు మోక్షానుకూల కర్మలయందే అభిని వేశనము కల్గును.

2. బాహ్య సృష్టియందున్న పదార్థ సన్నివేశముచే, యింద్రియములకు గలుగు ప్రేరణ. యిది స్వార్థరూపకర్మలకే దారితీయును. తిను, త్రాగు, సుఖపడుమని యింద్రియములు ప్రేరేపించును. ఈ రెండు రీతులు భిన్నముగానే యుండును. మొదటిది ఆత్మసంబంధము. అనగా బ్రహ్మసృష్టిలోనిది. రెండవది కేవలం బాహ్యసృష్టికి సంబంధించిన కర్మసంబంధము. ఈ రెండు పద్ధతులు తప్పపరస్పర విరుద్ధములుగా నుండును. కనుక వాని సంఘర్షణలోనే, మానవుని ఆయుష్షంతయు గడచిపోవును. ఈ రెంటినిర్ణయములు తెలుసుకొని, కర్మసృష్టియొక్క ప్రేరణ విడనాడి, శుద్ధాత్మయొక్క ప్రేరణాను సారంగా మనుజ్ఞుడు ప్రవర్తించిన యెడల ఆతడుచేయు వ్యవహారమంతయు స్వభావముగ మోక్షానుకూలముగనే యుండును.

## తన్నుతాను రక్షించుకొనుటెట్లు ?

జలప్రళయమునందు సర్వము నశించిన యెడల దాని వలన యెవరికి యేపాపము అంటును ? అట్లే, అధ్యాత్మ, ఆధిభౌతిక, ఆధిదైవికపద్ధతులలో యింద్రియ వ్యవహారము జరిపించక, కేవలం ఆత్మపద్ధతిలో త్రికరణ శుద్ధిగా ప్రవర్తించిన వారికే పుణ్యాపాపములూ అంటక, బ్రాహ్మస్థితి కలుగును.

అందుచేత, గురుమూర్తిచే అచలపరిపూర్ణ పరబయలును తెలుసుకొని, కర్మత్యాగ, కర్మఫలత్యాగ పద్ధతుల నవలంబించకుండా కర్తృత్వ త్యాగముగా కర్మలాచరించిన యెడల సూర్యాస్తమయ కాలమునకు యెండమావులెట్లు లేకుండాపోవునో, అట్లే ఆత్మయను యెరుక, దానికర్మ, సమూలంగా లేకుండాపోవును.

మనుజునకిచ్ఛయున్ననూ, లేకున్ననూ, ప్రకృతి రూప కర్మచక్రము సదానడచుచుండుటచే, దానితోపాటు తానుకూడా తిరుగుకతప్పదు. కాని పరిపూర్ణ బోధజ్ఞులగువారు, ప్రకృతిలో, కర్మపద్ధతిగా ప్రవర్తించక యింద్రియ నిగ్రహముచే బుద్ధిని స్థిరపరచి, శుద్ధమొనర్చి, సృష్టిక్రమాను సారముగా చేయవలసిన కార్యములు, కర్తృత్వరహితముగా కేవలం కర్తవ్య నిర్వహణ కొరకు మాత్రమే, చేయుచు శాంతముతో నుందురు. వీరే నిజమైన వైరాగ్యపరులు. స్థితప్రజ్ఞులుగా చెప్పబడుదురు.

మానవుడు వ్యావహారిక కర్మలను మాత్రము త్యజించి, అడవులకేగి సన్యాసిగానుండినను, కర్మక్షయమైనదని భావించుట భ్రాంతియేయగును. ఏలననగా తాను జ్ఞానేంద్రియములచేత విషయపంచకము తెలిసి కర్మేంద్రియములచేత కర్మమొనర్చుచున్నాడు. ఆ కర్మవిధానము భ్రాంతిరహిత స్థితికి అనుకూలముగా నున్నదని ప్రతికూలంగా లేదని బుద్ధి నిశ్చయము చేసుకొన కలిగిన పిమ్మటనే కర్మరహితం కాగలదు అంతేగాని, చేయవలసిన విధాయక కర్మలను మాత్రమే చేయుచున్నాను, మిగతా కర్మలను త్యజించి సన్యాసిగా నున్నాను అనుకొన్నంత మాత్రమున కర్మరహితంగాదు.

అగ్నిచేత యింధనములు దహించిపోవునట్లుగా జ్ఞానాగ్నిచే కర్మలన్నియు కాలిపోవును అనే దృష్టాంతముకన్న, తామరాకు మీద నీరుండిననూ అంటనట్లు పరిపూర్ణుడు కర్మలేశ మంటకుండా యుండునను దృష్టాంతమే సమంజసముగా నున్నది. పలననగా కర్మయనునది సంచిత రూపంగా కాలచక్రమునందుండి కాలాను గుణ్యముగా మానవుని ప్రారబ్ధరూపంగా అనుభవింప జేయును. ఇట్లు అనుభవమునకు వచ్చు కర్మ అశరీరపద్ధతికి భంగము లేకుండా ఆచరించినందున, కర్మ రహిత స్థితి బుద్ధిచే నిశ్చయింప బడి జన్మరహితమునకు సహజపద్ధతిగా నుండును.

అట్లుగాక మానవుడు తన స్వతంత్రముచేత, నిత్య నైమి త్తిక కర్మలాచరించకవిడచి, అనగా త్యజించి, వుండగలడు. అనగా అగ్నిచే సమిధలను దహించినట్లు, జ్ఞానాగ్నిచే దహించి సమాధి నిష్ఠయందుండగలడు. కాని కాలచక్రముతోపాటు శరీరము, బాల్యయౌవన, కౌమార, వృద్ధాప్యములు పొందడం, వెంట్రుకలు, గోళ్లు, పెరగడం తప్పుటలేదు. వృక్షాదులకు స్వయంగా తెలివిలేకున్ననూ, కాలానుగుణ్యమున ఋతువులను బట్టి కాత, పూతలు జరుగుచున్నట్లే, ఉప్పెనగాడ్పులచే క్షీణ వృద్ధులు పొందుచున్నట్లే, మానవుడు బాహ్యకర్మలు అనగా, వచన దానగమన విసర్జనానందములుమాని, పూర్ణసమాధియం దున్ననూ, అంతఃకరణ జీవోపాధి నశించుటలేదు. అది సన్యాస పద్ధతులచేత అనగా కర్మత్యాగ, కర్మఫలత్యాగ పద్ధతులచేతనూ, జ్ఞానసంపాదన వలననూ, కర్మలన్నియు నశించి పోవునని అను కోవడం భ్రాంతి మాత్రమే.

కర్మసమూలంగా నశించవలెననిన, అచలపరిపూర్ణ స్థి అంతఃకరణకు కల్గింపజేసి, సంచిత కర్మరాశినుండి కాలచక్రరీతిగ ప్రారబ్ధరూపం చెందు కర్మలనాచరించుచూ, జ్ఞానేంద్రియవ చేత విషయపంచకము తెలుసుకొని కర్తృత్వరహిత పద్ధతిగ కర్మేంద్రియములచే కర్మనొనర్చినచో, కర్మబీజములుసహా అనగ సంచిత కర్మతోసహా సమూలంగా రహితమగును. కనుక తావ రాకుపై నీరున్ననూ, దాని నంటకుండానున్నట్లు, నిదుర వచ్చే వరకూ చచ్చేవరకు కర్తృత్వ రహిత కర్మాచరణయందుండ వలెను. యీపద్ధతి పరిపూర్ణ బోధవలననే సాధ్యమగును.

## పూర్ణ బోధయందు నిర్ణయించిన కర్మరహిత విధానము

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం ఏమిలేదు అని నిర్ణయంతో కర్మాచరణ గావించుట కర్తృత్వరహిత విధానమునకు ముఖ్యము. మరణావస్థ, మరణవిధానము ప్రత్యేకంగా జ్ఞాపక ముండవలసిన పనిలేదు. బాల్యయౌవన కౌమారవృద్ధాప్య మరణావస్థలలో మరణావస్థనుముఖ్యంగా విచారించుట అవసరం. ఎంతటి మహాత్ములమని అనుకొన్నవారికైనా మరణకాలమున యేమీ తెలియదు. కనుక కాలచక్రరూప సంచిత కర్మ తన స్వరూపమునకు లాగుకొని పునరావృత్తిని కలుగచేయును. కనుక అగ్నిచే యింధనములు దగ్ధమైనట్లుగా, జ్ఞానముచే సర్వకర్మలు భస్మమై పోవుననేనమ్మకంతో బాహ్యకర్మలు మానియున్న వారిగతి యింతే కాగలదు.

కర్మోపాధికి కారణమగు ఆత్మస్వరూపమైన నేను పరి

పూర్ణపరబ్రహ్మమునకు సంబంధములేకనే వున్న నిర్ణయము తెలుసుకోలేక సర్వత్ర వున్నానని నిర్ణయించుకొని సర్వకర్మ ఫలములు పొందుటకు సత్యలోక కైలాసములు జీవేశ్వరైక్య ఫలములు, ప్రత్యగాత్మా పరమాత్మా ఐక్యములు బ్రహ్మత్వమూ పొందవలెనని, నిర్ణయించుకొని మరణము చెందుచూ అనేక జన్మలు పొందుచున్నాడు గురుమూర్తి కరుణచేత అచలపరి పూర్ణమునందు, కర్మకు కారణమగు, నేననే యెరుకకు మూలము లేదని తెలిసినందున, సర్వమునకు కారణరూపమైన గుర్తెరిగే శరీరమునకు మూలములేదని మననము చేయుచు, కర్తృత్వ రహిత విధానముగా కర్మాచరణము గావించును. ఈవిధంగా చచ్చినదనుక నిదురవచ్చిన దనుక ఆచరించును. కనుక మరణమేవిధంగా సంభవించినా, పునరావృత్తి పొందడు. ఏలా ననగా సంచిత కర్మబీజములుగాని, ఏ భ్రాంతిగానీ అంతఃకరణ యందుండదు. కనుక ఏవిధముగా జూచిననూ అతనికి జన్మము కలుగుటకు వీలులేదు.

## కర్మక్షయము

కర్మక్షయమనగా సర్వకర్మల బంధమునుండియు సంపూర్ణముగా విముక్తియని అర్థము. జంగమ జీవోపాధులకర్మ వ్యష్టి కర్మ, వీనికి మూలము "ఏకోహంబహుస్యాం" అనే పరమాత్మ కర్మలన్ని వుపాధులకు సమష్టికర్మ. వ్యష్టి సమష్టి రూపమగు కర్మయంతయు రహితమైనపుడే సంపూర్ణ కర్మ విముక్తి యనీ కర్మక్షయమనీ చెప్పనగును.

**"అహం బ్రహ్మాస్మి" అను పద్ధతియందు జన్మరహిత**
**కాకుండుటకు కారణము.**

అహం బ్రహ్మాస్మి అనుజ్ఞానం కలిగిన తదుపరి, జరు
కాలమంతయు శ్రేయోదాయకముగా జరిగినను, ఆ కాల
అన్నిటికంటెను మరణకాలమున యెట్లుండునో ప్రధానము
విచారించవలసియున్నది. మరణమనేది జీవిత చరమావస్థ. అం
ముందే బ్రహ్మజ్ఞానము కలిగియున్నవానికి, సంచిత ప్రారబ్ధము
నశించిననూ, తానైక్యముచెందిన బ్రహ్మ సృష్టికారణమగు
తన పద్ధతిగలది కనుక దాని సంకల్పమువలన జన్మాదులు క
ప్రారబ్ధము మరల తెచ్చుకొన్నవాడై దాని ననుభవింప
వచ్చును. కనుక మరుజన్మ తప్పక రాగలదు.

జన్మరహితం గోరు మానవుడు, బ్రహ్మైక్యభ్రాం
విడచి, పరిపూర్ణమందు యెరుకలేని పద్ధతిని తెలుసుక
మూలంలేని గుర్తెరిగే శరీరం యేమీలేదనే నిర్ణయంగా
చావు తాను తెలుసుకొని ఆయుర్దాయ నిర్ణయము లేకుం
డుండడం సులభోపాయము గనుకనే

ఆ. వె॥ చదివి చదివి జనులు చావంగ నేటికి
చావులేని చదువు జదువవలయు
చదివి చదివి జనులు చచ్చుచున్నారయా
విశ్వదాభిరామవినురవేమ ! - ॥

అని వేమనయోగి చెప్పియున్నాడు. చావులేని చదువన
ఆయుర్దాయమునకు కడపటి కాలము మరణము. ఆ వ

సమయమునందు యేకోరిక యుండునో, ఆ కోరిక సాధించుటకు, తత్సుఖానుభూతికి జన్మలు యెత్తవలసి వుండును. అట్టి కోరిక లకు మూలమగు యెరుకను, మూలము లేదని తెలిసికొని, ఆయుర్దాయ మున్నంతవరకు జ్ఞాపకముంచుకొన్న యెడల, మరణ సమయమున తాను లేకపోవుచున్నాడు. కనుక జన్మకు కారణము లేకుండా పోవుచున్నది. పరిపూర్ణబోధమార్గమే జన్మరహిత మునకు చక్కనిదారి. ఈ దారియే రాజమార్గము. దీని యందెట్టి మోసమూ లేదు. ఉండదు.

అహంబ్రహ్మాస్మియను, అనుభవపద్ధతి, కుడితిలోబడిన బల్లివలె నుండును. ఏలననగా, బల్లి అందరికి శకునం చెప్పునేగాని, తానే కుడితిలోబడిన సమయమందు తన శకున జ్ఞానమున్నదా ! వుంటే కుడితిలోనే బడదుగదా ! ఆ సమయమందు తానే మగుచున్నదో తనకే తెలియదుగదా ! అది ఏ నిర్ణయము తెలియకుండానే యెట్లు మరణించునో, అట్లే అయ మాత్మా బ్రహ్మయను మహావాక్య జ్ఞానము కల్గినవారున్ను మరణింతురు.

జాగ్రదావస్థయందు తెలుసుకొనే ప్రత్యగాత్మరూపమైన తెలివిచే, జహదజహల్లక్షణము (భాగత్యాగలక్షణ) చేత ప్రకృతిని త్యజించినానని, తాన ఖండ బ్రహ్మపద్ధతి పొందినానని, ఆ ప్రకృతి యందుంటూనే అనుకొనుచుండును. ప్రకృతిని విడచి తానుండుట అసంభవము. అందువలన మరణావస్థ పొందు సమయమున, బీజవృక్షన్యాయముగా అనగా వృక్షముయొక్క సర్వఆకార వికార ములు బీజమునందెట్లు యిమిడియుండునో, అట్లు మరుపు

రూపం జెంది పునర్జన్మ నెత్తును. వార్తిక సిద్ధాంతము గలవారి పద్ధతియు నట్లే యుండును. జన్మరహిత విధానము తెలియ గోరువారు పరిపూర్ణ నిర్ణయ గురుసాంప్రదాయమునే ఆశ్ర యించవలెను.

## ముఖ్యముగా గమనించవలసిన విషయములు

వైదిక ధర్మమునందు కర్మకాండ జ్ఞానకాండయను రెండు ప్రసిద్ధ ధర్మములుగలవు. కర్మకాండయందు సూర్య, అగ్ని, యింద్రవరుణాది వైదిక దేవతలను యజ్ఞములచే పూజించి సంతుష్టులను చేసినచో, వారి ప్రసాదముచే యిహామందు పుత్ర పౌత్రాది సంతతిని, ధన ధాన్యాది సంపత్తిని పొంది, మరణా నంతరము సద్గతి గలుగునని ముఖ్యముగా నుపదేశింపబడుచున్నది. ఇందు నిర్ణయపద్ధతులు ఒకదానికొకటి విరుద్ధములై యున్నందున వీని నన్నింటిని ఒక చోటికి చేర్చి జైమిని కర్మసూత్రములు నిర్ణ యించినాడు. అదియే పూర్వ మీమాంసయను పేర ప్రసిద్ధమై యున్నది.

యజ్ఞయాగాది శ్రౌతకర్మ ప్రతిపాదకములగు బ్రాహ్మణ గ్రంధముల యనంతర కాలమునందలి వైదికగ్రంధములకు ఆరణ్య కములని, వుపనిషత్తు లని పేరు. వీనియందు, యజ్ఞయాగాదుల ఫలితము అశాశ్వతము లనియు, బ్రహ్మజ్ఞానమే శ్రేష్ఠమనియు ప్రతిపాదింప బడియుండుటచే వానిని యేకపద్ధతిగా చేయుటకు బాదరాయణుడు (వ్యాసభగవానుడు) బ్రహ్మసూత్రములు రచించినాడు. వానిని శారీరకసూత్రములనియు వుత్తర మీమాంస

యనియునుడువుదురు. కనుక కర్మకాండకు పూర్వ మీమాంసా శాస్త్రము, జ్ఞానకాండకు వుత్తర మీమాంసాశాస్త్రము ప్రధాన ప్రమాణ గ్రంధములై యున్నవి. చూడగా యీ రెండున్నూ మీమాంసా స్వరూపములే, వీని ననుసరించువారిని కర్మిష్ఠులని, మరొకరిని వేదాంతులని యందురు.

## ఋణ నిర్ణయము

ఋషి ఋణము వేదాధ్యయనము వలన దీరును. దైవ ఋణము యజ్ఞయాగాదులచే దీరును. పితృఋణము సంతాన ప్రాప్తిచే దీరును. యీ త్రివిధ ఋణములు ప్రతిమానవుడు దీర్చవలసి వుండునని కర్మమార్గము.

ఈ త్రివిధ రూపములగు కర్మల నొనరించినంత మాత్రమున జన్మఫలము సిద్ధించదు. ఉపనిషత్తుల నిర్ణయానుసారము, జ్ఞానవైరాగ్యపద్ధతులు ఆచరణీయములని వేదాంతు లందురు. కర్తృత్వరహిత కర్మాచరణ వలన మాత్రమే జన్మరహితమగునని యితర యేపద్ధతులవలన జన్మభ్రాంతి తొలగదని పరిపూర్ణుల నిర్ణయము. కర్మరూపమైన సంసారము యజ్ఞమయము లేక కర్మమయము అని యున్నను, వానిని చేయువారు రెండురీతులుగా కర్మచేయుచున్నారు. శాస్త్రోక్తముగా కర్మలాచరించువారు కర్మిష్ఠులు. నిష్కామముగా కేవల కర్తవ్యమని యెరిగి అన్ని కర్మలుచేయువారు జ్ఞానులు. మొదటివారికి స్వర్గప్రాప్తి యగును. రెండవవారగు జ్ఞానులకు మోక్షఫలము సిద్ధింపగలదని నిర్ణయము స్వర్గము, మోక్షము అను భ్రాంతిలేని అచల

పరిపూర్ణులు, కర్తృత్వరహిత కర్మాచరణ పద్ధతిగలవారు గనుక వారి ఫల మిట్టిదని నిర్ణయించుటకు శక్యముగాదు.

## ఫల నిర్ణయము

కర్మిష్ఠులకు స్వర్గలోకప్రాప్తి; జ్ఞానులకు మోక్షరూప ఫలప్రాప్తి: జ్ఞానాజ్ఞాన రహిత పరిపూర్ణ భావజ్ఞులకు జననమరణ రహితఫలము: కనుక ఫలములు యీ తీరున భిన్నములగుటచే వానిని గమనించి, మరణ సమయమున యేపద్ధతి మానవజన్మ ఫలస్వరూపమో నిర్ణయించుకొని మానవులాచరించ వలయును.

ఇతి శ్రీ అచలఋషిదయానంద
పొన్నాలరాజయోగి విరచిత
పరిపూర్ణ రాజవిద్య రాజగుహ్య శిఖామణి
రాజయోగీయము సంపూర్ణము
సర్వం సద్గురు చరణార విందార్పణమస్తు
శ్రీ నిజగురు మహారాజకీ జై జై జై



కం॥ మతముల వారలు । తమ సమ్మతమైనటువంటి । శాస్త్ర
మర్యాదలచే । మితమేరుపరచుకొని । బహుగతులను
కలహింతు । రట్టి గతినీకేమిటికీ । చపలత జెందె స్థితి
నీకేమిటికీ । ప్రతిలేని యీ బట్టబయలుండ జూచి । సంత
తము లేనెరుక । లేనిదనినమ్మ్మ । మిక వారి గతినీకేమి
టికీ । చపలత జెందె స్థితినీకేమిటికీ ॥

శ్రీ శివరామదీక్షిత సాంప్రదాయక పీఠ
గ్రంథములు వలయువారు

# పొన్నాల రాజయోగి

అచలగురుపీఠము

నెం. 4-1-96, రాజయోగాశ్రమము

పాతబోయిగూడా,

సికింద్రాబాద్ 500003 – ఆంధ్రప్రదేశ్.

అని వ్రాయవలయును.